# భక్తిరసామృతము.

గ్రంథకర్త్రి:

బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులుగారి

మనుమరాలు

శ్రీమతి సత్యవతి.

---

ప్రకటనకర్త:

శ్రీమతి బసవయ్యగారు, గుంటూరు.

---

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల బెజవాడ.

[గ్రంథకర్త్రి కాపీరైటు] 1922 [వెల రు 1-0-0

ఓమ్.

# భక్తిరసామృతము.

చిమకుర్తి సత్యవతి ప్రణీతము.

ప్రకటనకర్త:

చిమకుర్తి బసవయ్యగారు, గుంటూరు.

ప్రథమముద్రణము: 1000 ప్రతులు

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు.
క. కోదండరామయ్యచే ముద్రితము.

 1922 [వెల రు 1.

# పీఠిక.

నాకుఁ జిఱుతప్రాయమునుండియుఁ బద్యరచనయందాసక్తి మెండు. వచనకావ్యములకంటె బద్యకావ్యముల జదువుటయె మిక్కువ ప్రీతి. ఛందోవ్యాకరణాది శాస్త్రములను, గావ్యంబులనభ్యసింపకయె, భగవదనుగ్రహలబ్ధ కించిద్గ్రంథపఠన జన్యజ్ఞానలవముచే భక్తియుతంబుగ నీపుస్తకమును వ్రాయ బ్రారంభించితిని. ఇదిపూర్తినొంది 10 సంవత్సరములైనను గారణాంతరములచే ముద్రించుట కిచ్చగింపనైతి. మాబంధువులలోవనేకులు పుస్తకముత్వరలో నచ్చొత్తించిన బాగుగ నుండుననియు దీనినిఁజదువుకొనుటకుఁ దమ కభిలాషగలదనియుఁ బలుమాఱుఁ గోరుటచే నాహృదయేశుననుగ్రహభాగ్యమున నేటికిముద్రింపనయ్యె. శాస్త్రపరిజ్ఞానరాహిత్యనా నాచే బాల్యమునందే వ్రాయబడిన యీపొత్తమునందుఁ బొరపాటునఁ గల్గుదోషంబులు పెక్కులుం

దగమూనవు. గుణగ్రహణపారీణులగు పండితోత్తములు "చెఱకునకు వంకపోయిన తీపు నశించునా" యనునట్లు నాదోషంబులనెంచక గుణములనే గ్రహింపవేడెద. ఈపుస్తకరచనకు బ్రోత్సహించి నాకుత్సాహముగలిగించిన మదీయగౌరవాస్పదులగువారికి వందనశతంబులు. మరియు పుస్తకమువ్రాయనగినంత సామర్థ్యము నాకులేకున్నను నా హృదయకమలమునందు తానేనిలిచి నాకుశక్తిసామర్థ్యములు గల్పించి పలువిధముల దోడుపడిన త్రిమూర్త్యాత్మకుండును సర్వాజ్ఞానసగోచరుండును, భక్తాభీష్టఫలప్రదుండును నగు పరమేశ్వరుని దివ్యచరణారవిందములకే యీపుస్తకమును సర్వాపరాధ క్షమాపణగోరుచు సమర్పించి కృతకృత్యనైతి.

గుంటూరు,
1-6-1922.

ఇట్లు
శ్రీమతుర్తి సత్యవతి.

# కృత్యాది.

క॥ శ్రీగరుడనందివాహుల
భోగీంద్రశయానదివ్య భూషాలగిరిజా
సాగరసుత హృదయేశుల
నాగమవందితులఁగొల్తు ననిశముమదిలోన్.

సీ॥ దానధర్మములు సత్క్రతువులుగావించి
ధన్యుఁడయ్యెను మత్పితామహుండు
తపశ్శీలుఁడై సలిపెను సత్కార్యముల్
దానాచరించె మాతామహుండు
వేదవేదాంగ సద్విద్యలందత్యంత
విజయుఁడై మెప్పొందె పెద్దతండ్రి

ప్రజలచేదానరి ప్రజ్ఞానవంతులై
మన్ననవడసె నామాతులుండు
గీ॥ ఘనులుకీర్తినార్జించి లోకంబుబాసి
మోక్షసామ్రాజ్యమునుబొంది ముక్తులైరి
ప్రణుతులొనరింతు వారలపాదములకు
సర్వదావారినామంబు సంస్మరింతు. 1

సీ॥ శాంతస్వరూపులై జనులమేలునుగోరి
గ్రంథముల్ రచియించి ఘనతగాంచి
చిత్రలేఖనమందు చిరతరసత్కీర్తి
గడియించివెలసె నాకన్నతండ్రి
సగుణాలవాలమై సుదతీమణులకెల్ల
దామార్గదర్శమై ధన్యయాము

. నేలోపమును లేక యిహపరంబులనుసా
ధించిమించెను నస్మదీయజనని
గీ॥ వందనశతంబులర్పించి వారిపాద
పద్మములగొల్తునేప్రొద్దు భక్తితోడ
నిట్టిలలితంపుప్రియకును జనింపజేసె
నట్టిదేవునిభక్తితో నభినుతింతు. ౭
సీ॥ అన్నశ్రాద్ధంబె ముఖ్యంబనివాదించి
వేదోక్తమునుముందు వెలయజేసె
దశరాత్రిరే వైశ్యతతికెల్ల నాశౌచ
విధియంచు దానెగావించెమున్న
భగవదార్పణబుద్ధి బాలురకుపనయ
నాదులనొనరించె నధిక ప్రీతి

మహితకార్యంబెద్ది మదికిఁదోఁచిన, దాని
దీక్షతోఁగావించి తృప్తిఁగాంచు
గీ॥ నట్టి మత్ప్రియభక్తు కహర్నిశంబు
ప్రీతిసాష్టాంగ దండమర్పించుదాన
నిట్టిమహనీయుపతిగాఁగ నిల జనింప
నిహపరంబుల సాధింప నేమికొరత. 3

గీ॥

| | |
|---|---|
| బ | హుళ నిర్మలతరకీర్తిభవ్యమూర్తి |
| స | త్యపథవర్తి బంధుపోషపవిత్రి |
| వ | రలుమద్హృదయాంబుజ భానుమూర్తి |
| య | నగ బేర్గాంచు మన్నాథు నభినుతింతు. |

# అభిప్రాయములు

ఉ॥ భక్తిరసామృతంబొలుకు భావమునన్ రుచిజిల్కు నీశ్వరా
సక్తినిజూపు ఘోరకలుషంబులబాపును ముక్తికాంతపై
రక్తినినిచ్చు దుర్భరవిరక్తినిదెచ్చు బఠించువారికిన్
భక్తిరసామృతంబను ప్రబంధము; దీనిమహాత్మ్యమెట్టిదో.

గీ॥ గానము కవిత్వమును సాధ్వి కంఠభూష
గాని మగవానిసొమ్మెప్డు గాదుకాదు
గానవేవాణి నుభయాభిమానినిగను
తద్జ్ఞ లనిరంచు నీదుపాత్రంబుదెల్పె.

క॥ కవితకువలసిన గానముల
కవులెన్నిటి జెప్పినారొ కలవన్నియు నీ

భక్తిరసామృతము.

కవితగా గావున నిల నో
కవయిత్రి! నిలుచునీదు కబ్బము స్థిరమై.

అవధానిశిరోమణిః, శా॥ కృష్ణాచార్యః.



గీ॥ భక్తిరసముప్పతిల్లగఁ బద్యవితతి
నల్లి "భక్తిరసామృతం"బనెడి నామ
మిడిన త్వద్గ్రంథమును దిలకించి పొంద
మంచు నానందమొందితి నన్నమిన్న!

బెజవాడ,
12-8-22.



కర్లపాలెం కోదండరామయ్య,
ఆంధ్రకావ్యహారం, కవిత్వతత్త్వవిచారక గ్రంథకర్త.

# భక్తిరసామృతము.

## శ్రీరస్తు.

శ్రీగుంటూరుపురవాస్తవ్యులును, వైశ్యకులోద్భవులును, సచ్చరిత్రులునగు శ్రీ చీమకుర్తి బసవయ్యగారి సతీమణియయిన సత్యవతీదేవిచే బాల్యదశయందే యాంధ్రమున రచియింపఁబడిన "భక్తిరసామృత" మనెడి గ్రంథము కేవల సార్థకనామమనుట స్వభావోక్తియే గాని యతిశయోక్తికాదు. ఇది సమంజసమైన పద్యకావ్యము. "దేశభాషలందు దెలుగులెస్స" యను లోకోక్తికిది తార్కాణము. గ్రంథమంతయు మొదటినుండి కడవరకు నేకరీతినొప్పుచు ముద్దులుగుల్కుచు, ద్రాక్షాపాకమున నున్నది. ఇందు గవిత్వవిశేషము లెన్నియేనిగలవు. ఇందలి వృత్తములనేకము లుండుటయేగాక గానయోగ్యములుగనున్నవి. ఇదియొకశతకము కాదుగాని శతకసంచయమనందగి

పుట్టువనిలోన మేటివై కొంటివమ్మ
పతకమును వైశ్యరత్నమ! పరిష్కరింౘ.

రాజవైద్య, గ్రంధి వెంకటసుబ్బరాయగుప్త,
నంబూరు.

---

24-2-21 తేదిని స్త్రీల సభాగోష్ఠి వరుసాలుగానున్నప్పుడు
పులికొండ రుక్మిణీసత్యారత్నముచే జదువఁబడిన పద్యము.

సీ॥ చిత్రలేఖనమును చెలువొప్ప లిఖియించి
మెప్పును వడయంగ మెలఁగితమ్మ
చారుతరంబుగా సంగీతమును బాడి
వేడ్కనొసంగగా వెలిగితమ్మ

పరమేశు నుతియించు పద్యంబులల్లుచు
శీలంబు మించగా చెలగితమ్మ
వెలదులు మెచ్చంగ వింతవింతగ కుట్టు
పనులందు మెప్పును బడసితమ్మ

గీ॥ బాలికలకును పాటలు బాడునట్టి
సరణిఁ జూపించు మార్గంబు బరగితమ్మ
మానినీరత్నములకెల్ల మార్గదర్శి
వౌను ఇల చీమకుర్తి సత్యవతి యువతి.

---



# భక్తిరసామృతము.

కైలాసగిరీశ యీశ శివ సచ్చిద్రూప సర్వేశ్వరా
శ్రీకంఠా భవపాశనాశ వరకాశీవాస విశ్వేశ్వరా
పాకారిప్రముఖామరార్చితపదా! పాపౌఘవిధ్వంసకా
నీకారుణ్యముఁజూపి బ్రోవఁగదవే నిత్యంబు నిన్వేఁడెదన్

మ॥ కరుణానందస్వరూపుఁడు లోకరక్షకుఁడు శ్రీకంఠుండు గౌరీమనో
హరుఁడున్ బన్నగభూషణుం డఖిలలోకారాధ్యుఁడున్ జంద్రశే
ఖరుఁ డుగ్రుండు త్రిశూలపాణియు నుమాకాంతుం డటంచున్ బుధుల్
నిరతం బేమహనీయుఁ గొల్తు రతఁడే నిత్యంబు మమ్మేలుతన్॥ 2

భక్తిరసామృతము.

చ॥ గరళము దాల్చి కంఠమున గావగలేవొకొ మున్ను లోకముల ౨
హర! నిను వేడినంతన శశాంకుని యందు గళంకమెంచకే
శిరమున దాల్పలేదొ శివ! చిన్నతనంబని నెంచినావె?
నీ చరణయుగంబు నమ్మి యిటు నే సత్కృతి నిచ్చెద స్వీకరింపవే॥
మ॥ జనకా! మాపయి కోపమే? కరుణ లేశంబైన లేదే మొరల్ 3
వినవే! భక్తులగావవే! గతియు నీవే కావ! వేరున్నదే?
యనఘా! నీ చరణారవిందముల నిత్యంబున్ మదిన్నమ్మమే?
చనవే! నీకిది న్యాయమా హర! జగదీశా! మమ్ము రక్షింపవే॥
ఉ॥ నేరను తండ్రి! నీదు మహనీయగుణంబుల నెంచ ఘోరసం 4
సారము నస్థిరంబనుచు, శాశ్వతమై సుఖమైన నీదరిం
జేర నిజైకకర్మమిక శ్రీకరమా పరమొల్లుకొంచెదన్
ధారమనన్ను గాచిన నిజభక్తవశంకర శంకరా! హరా! 5

ఉ॥ ఏమని విన్నవింతు, నిది యెప్పటిదేగద యుంచు చిత్తమం
దేమనుకొందువో? కనుగొనలేదవో? కనినంబు జూపెదో?
బాముల బెట్టెదో? సుతుల బాలనముంచెదో, నీటముంచెదో?
నా మొరలాలకించెదవో? నన్నుఁ జేసెదవో? మహేశ్వరా!॥ 12

చ॥ ఎరుఁగక పాపకృత్యముల నెన్నియొనర్చితినో? మహేశ! నే
నెఱిఁగి యొనర్చినట్టి క్రియలే మితిమీరి భయంబుగొల్పెడిన్
దురితములన్ క్షమించి దయతో నను బ్రోవుమటంచు నెట్లు నిం
శరణని వేడికొందు భవసాగర మెట్లిక దాట జాలుదున్॥ 13

మ॥ నను గన్నయ్యవు నీవెకావె జనకా! నాపాలిభాగ్యంబ! నన్
గనుఁగొంచున్ బిడ్డనంచు నెదలో గారుణ్యమింపార "నో
తనయా! రమ్మిక బ్రోతు" నం చభయహస్తం బిచ్చి రక్షింతువే?
నిను వీక్షింతు నెన్నఁడైన నిలలో నేధన్యతంగాంతునో!॥ 14

ధృవ॥ శరణుదేవ! మహానుభావ ప్రశాంతమానస యీశ! నీ
చరణపద్మము లాశ్రయించితి జాలమేల మహేశ్వరా
యెరుగకుంటివా? నాదుబాధల నేవిధంబున బాపెదో?
కరుగకుంటివో నీమనంబిక కావవే కరుణాకరా! ॥ 18

అంచ॥ విరాన నిన్ను జేరగోరి బిడ్డలిట్లువేడగా
ఏరాకుజేసెదేల? మూఢపాపి నీవగాదటో
నిరాకరింతువేల తండ్రి నీవె యిట్లుజేయగా
మఱేదిదిక్కు దేవదేవ మామొరాలకింపగా ॥ 19

చ॥ నమస్తలోకపాల! సర్వసౌఖ్యదాయకా శివా
యుమామహేశ నిన్ను నమ్మియున్న వారమేగదా
క్షమాది సద్గుణమ్ములిచ్చి స్వామిమమ్ములోబ్రోవవె
నమోఘదుఃఖాపహర లోకనాయకా కృపాకరా! 20

తోటకము॥ పరమేశ్వర నీ పదపంకజముల్
నిరతంబును నామదినిల్పద నో
శరణాగతరక్షక సన్నుత స
ద్గురు మోక్షమొసంగుము గొల్తునినున్॥ 21

ఉ॥ పాపవిహీనమౌ విషయజాలములందున జిక్కియుంటి నే
టీరువనైన బోధించి నాతదీరిచి నీకు సేర్పుడటివా
నేరని సేవనొంది యిటు నీకృప నాపయి జూపకుంటివో?
భారమటంచు నెంచితివొ? పాపవినాశక చంద్రశేఖరా!॥ 22

ఉ॥ ఎప్పుడు నీదు నామమును యింపుగ బాడగ గోరుచుందు నా
తప్పుల నెన్ననేల? కరుణాదైవమ! నీవె యుపేక్ష చేసినన్
చెప్పను నన్ను బ్రోవగల శక్తుని వందిక; జూడ సర్వదా
యిప్పుడదిగా స్వభావమని యెంచగదే కరుణామయా! హరా! 23

మత్త॥ సర్వలోకవిభుండవౌదువు సాటి నీకు లేరుగా
యుర్విబాధల నొందియుండుచు నుండజాలను బ్రోవరా
సర్వదానిను నమ్మి కొల్చెద సంకటంబుల బాపవే
గర్వభంజన భక్తరంజన కామితార్థము లీగదే॥ 24

ఉత్సా॥ సన్నుత ప్రభావదేవ సర్వలోకవందితా
నిన్నుగాక దైవమొండు నిక్కముగను లేదుగా
పిన్న పెద్దలెన్ననేల పిలువగాన రమ్మి నా
విన్నపంబు నాలకించి వేగరక్ష లీగదే॥ 25

సుగంధి॥ సావధాన చిత్తవౌచు సన్నుతింతు నెమ్మదిన్
పావనంబు సర్వలోక వాంఛితప్రదంబుగన్
తావకీయ దివ్యనామ తారకప్రభావమున్
దేవ నే నెరుంగజాల దీనరక్ష పాహిమాం॥ 26

భుజంగప్రయాతం॥ సదానిన్ను గొల్వంగజాలగా మహాత్మా
మదిన్నెంచలేకయ్య మన్నించవేగా
బదుల్పల్కకున్నావు భక్తార్తి బాపం
గదే సర్వలోకాధి కారా సమస్తా॥ ౨౭

పాదవృత్తం॥ భావమునందున భక్తిని గొల్తున్
సేవకురాలను శీఘ్రము బ్రోవగా
నీవగదా మరి నీవిటు సేయగా
దేవపరాత్పర దిక్కిక గానగ॥ ౨౮

మత్త॥ ఎన్నిరీతుల వేడుకొన్నను నేలరావిటు దైవమా
కన్నతండ్రివి నీవియిట్టుల గాసిపెట్టుట న్యాయమా
విన్నగాకిక నన్నుగావను నిక్కమెంచు దలంపుమా
చిన్నదానను నేరమెన్నక శీఘ్రమే దరిజేర్చుమా॥ ౨౯

ఉ॥ ఎన్ని దినంబులాయె నిటు లేలొకొ? మౌనముదాల్చి యూరకే
వన్నెలయింప న్యాయమగునా సదయుండ విదేటికయ్య నీ
వెన్నడు నిట్లొనర్తువని యెంచగనైతి హితంబు దెల్పినా
విన్నపమాలకింతువని వేడెద భారమునీదె శ్రీహరీ। 30

తరళ॥ పరమపురుష మురలువినవా పతితములను వరయకే
కరుణగనవె దోరవుగదవె గనల కికను సుతుల నీ
చరణకమలములను భజన సలుపదలతు నిరతమున్
హరుడవనరె యఖిలదురితహరణ మనము కరుగదే। 31

కుసుమవిచిత్రం॥ హరిసుచరిత్రం హరినుతిపాత్రం
మగమునిస్తోత్రం సురచిరగాత్రం
పరమపవిత్రం భవహరమంత్రం
దురితలవిత్రం స్తుతిజనపాత్రం। 32

మేఘవిలసితశ్యామాత్మగాహారి  పరమపురుషనే

నీపాదంబులె  నిజముగ గతియా

నే పాపంబుల నిక నరయకుమా

యాదవబాంధవ యదుకులతిలకా। 33

చ. వ్రతములు నోములాది యుపవాసములింత మహాత్మ్యమంచు న
త్కృతులెంచు యజ్ఞయాగములు దానముధర్మము తీర్థయాత్రలున్
యతులితమౌ జపంబు మదికద్భుతమైన తపంబులెల్లనే
హితమతి సేయనైతినిక నెట్టులగాతువొ నన్ను దైవమా। 34

శా। ఏవంగాని భవత్పదాబ్జముల సేవత్యంతముగా భక్తితో
నానావోట మ్రొక్కుచుండుదును నీనామంబు నెంతుగా మదిగా
నేనింకేమియు సేయజాలనిక నానేరంబులన్ సైచి యా
త్మానందంబున దావు జేర్చి కృపనన్నాశీర్వదింపంగదే ॥ 35

పద్మనాభవృత్తం—:శ్రీకాంతనావంత లంతంబుగావించి
శ్రీఘ్రంబె సౌఖ్యంబు నీయంగ రావే
నీకన్న నాకెవ్వ రున్నారు రక్షింప
నీకేజవ శ్రేష్ఠుగా భక్తపాలా!
గైకోవ దేవా! ననుంగావ లేవా!
జగద్బాంధవా! బాధలోర్వంగజాలన్
వైకుంఠవాసా! రమాహృన్నివాసా!
కృపాజూపుమీశా!మహేశా నమస్తే॥ ౩౬
భూతిలకం॥ ఎంతని వేడుదు సర్వేశంబున నేలరా నిటు దేవ మే
మెంతటివారము యింతనిర్దయ యేలగల్గెను మాపయిన్
అంతము లేనిభవాబ్ధిమున్గితినక్కటా! దరిచేర్చవే
చింతలు దీర్చి వేగనీపదయుగసేవ కావలి నేలవా। 37

ప్రి హేయ॥ ప్రతిదినమును నీపాదాంబుజాబుల్
అతులితముగ నాయాత్మం దలంతున్
వెతలుడుపగ నీవిశ్వంబులో నం
గతియిక గలదే కారుణ్యమూర్తీ॥ 38

ప్రిభాకలితం॥ హరిహర నీపదాంబుజంబు లహర్నిశంబులు గొల్తునా
దురితము లెంచకు రక్షకుడవు దుఃఖవారధి దోయకే
శరణని నీదరి జేరినందుకు జన్మసార్థకమౌనటుల్
వరమిడవే నిజదాసపోషక భవాబులెల్ల దొలంగగ॥ 39

మధువిలసిత॥ రావే వేగమె రఘుకులతిలకా
నీవే దిక్కిక నిరతముమరితే
దీవిశ్వంబున నిక నెవరకటా!
భావాతీత కృపమునను గవవే॥ 40

వనమయూర॥ నీదగుకటాక్షమిల నిక్కముగగల్గన్
వేదనలుబాయునని వింటిమి మహాత్మా
బాధలిటుగల్గినను బాపవది యేలా
యేది భవదీయకృప యెందుకిటురాదో॥ 41

ప్రహేయ॥ దరిశనమిమ్మా ధన్యాత్మసాదున్
పరిపరివిధులన్ ప్రార్థింతు నే నిన్
వరమిడగదవే స్వర్గంబెయైనన్
నరకమునిడినన్ నాకిష్టమేయా॥ 42

సుముఖి॥ సగుణతవౌచు జరాచరముల్
యగణితమైన యనేకములన్
సొగసుగజేసి శుభప్రద నీ
వగుపడకుంటి వదేలనో॥ 43

స్రగ్విణి॥ రారనాస్వామి కూర్మిరంబుజాపంగ నా
నేరమావైరమా నిన్ను నేగొల్వనా
భారమంచెంతువే భక్తులంబ్రోవగా
శ్రీరమానాధ నాచింతలందీర్పవే॥ 44

అంబురుహ॥ నేరమనీవిటు నిర్దయజూపగ నిర్మలాత్మనిరంజనా
సారెకునీపద సారసముల్ మనసార భక్తినిగొల్తుగా
లేరకనీవరి దైవముదిక్కిక లేదు నీదరి జేరితి
సారములేని భవాబ్ధినిదోయుచు జన్మబాధ లెటోర్తునో॥ 45

అర్కుట॥ కలవరమూఢమానవులు కావకనామముని
కృపలమతినిన్ను గొల్వ సిరిసంపదలిత్తువుగా
కలనిజమంచు నమ్మికడగావని కష్టముల్గ
గలుగగజేసిరొందుచు జగంబు నశింపగునే॥ 46

మాలిని॥ పరమపురుష నాపాపంబులన్ బాపవేరా
హరహరయను నీనామామృతంబే హరించున్
దురితములను యామాధుర్యమా నీజపంబుగా
నిరతము పఠియింపన్ నీవుపేక్షింతువే॥ 48

విద్యున్మాలా॥ రావే సీతారామా దైవం
బీవేగావే మీపాదంబుల్
సేవింతున్ భస్మీభూతంబై,
పోవున్ పాపంబుల్ నేరంబుల్॥ 49

కమలవిలసితము॥ మహిపలువెతలను మముబడదోయున్
మహితుఁడవని నిను మదిగొనియాడన్
అహరహములు నిను నభినుతిజేతున్
ఇహపరసుఖముల నిగడదె దేవా॥ 50

వసంతతిలకం॥ నాపాలిదైవమిటు నన్నుతరింపఁజేయం
నాపూర్వపుణ్యమని నామదిలోన నెంతున్
నీపాదపద్మముల నెమ్మిభజింతునింకన్
కోపంబుబూనకుమ కోర్కెలనీవ దేవా॥ 51

మణిగణనికరము॥ పతితములఁబ్రోవఁ బ్రభుఁడవనుచు ని
న్నతులితముగ భవహరుఁడనియనరే।
మతినినుగొలిచెద మనుపఁగదె కనా
గతి త్రిభువనపతి కరుణనుగనవే॥ 52

స్రగ్విణీవృత్తం॥ ఎంతకాలమాయె నీవిధంబుగా
వంతమానసీకు పాడియానకో
ఓంతదీర్పవేల చేతగాదో నీ
వింతకాఠిరచిత్తమేలదాల్తువో॥ 53

ప్రహరణకలితం॥ మనవినివినుమా మముగృపగనుమా
యనవరతము నీ యడుగులెగొలుతుఁ
కనులననినునే గనుగొనుటెపుడో
క్షణమొకయుగమై గడచునుజనకా॥

మానిని॥ ఏమని తెల్పగనేర్తును నావిధి యెట్టులనుండెనొ దైవమహా
స్వామివినీవని నమ్మితి నీభవసాగరముఁ దరిజేర్పగదే
నీమహనీయగుణంబులవింటిని నీసరిలేరని మ్రొక్కితినా
బాములబాపి శుభంబులనీగదె భక్తజనప్రియ దండ్రిగదా!

భాస్కరవిలసితం॥

ఎల్లజగములను నెంతయు ప్రేమఁ నేలెదవని బుధులనవినినే నీ
పల్లవమృదుపద పంకజములనా భావమునను నిరతముభజియింతుఁ

చల్లగ ననుదయ జూడుము నేనీ సన్నిధి నిలువగ నిరతము గోరి
కల్లయటనినను గాదని ద్రోయం గాదగునా గా కరుణను గను దేవా।
కరిబృంహితము। నాదుజనకుడ నీవనను విడనాడక పరమేశనీ
పాదముల మదిలోన గొలిచెద భక్తవరదుడ బ్రోవవే
నీదగలనాకోక్షతరముగు నేహ్యావిషయసుఖాంబుధిగా
వేదనలబడి వేడితినిదిను వేరుగతి గననైతిగా॥ 57
భద్రకవృత్తం। పరమపురుష పాపనాశనా
దురితములను ద్రోలవేల నీ
బిరుదములను బ్రీతిరేకనే
మరతువిది సమంజనంబొకో। 58
పృథ్వీవృత్తం। పరమపురుష కృపానిరతిగా
నిరతము గనుమని నిన్గొలుతుగా

శరవణమనుచు వేగముగా
వరమిడి వెతల బాపగదే॥ 59

ఉ॥ చిక్కితివు నీవు నామదికి జిక్కితివేనియు నిల్వబోవు నీ
వెక్కడివాడవయ్య యిటులేటికి జేసెదవో యెరుంగ నా
చిక్కులు దీర్పవాడవని చిత్తమునన్ వసియింపుమన్న నా
దిక్కటు జూడవైతి విటుదేవ భవత్కృప యిట్లుమాకునే॥ 60

తోదకవృత్తం॥ నాయిలవేల్పవు నాగతినీవే
వేయివిధంబుల వేడితి నిన్నే
హాయిగ దుఃఖము లన్నియు వేగం
బాయగజేయవె పావనమూర్తీ॥ 61

మణిమాల॥ రారా రఘువీరా రాకుంటివదేరా
భారంబనదేరా భక్తార్తిని బాపగ

కేరా యఘుదూరా లేదా దయరాదా
నీరాక మొగాదా నిన్వేడగ లేదా॥ 62

ఉ॥ ఎన్నఁదయయ్య నేరముల; నెన్నియొనర్చిననేమి నేను నీ
కన్నుల గప్పిచేసిన యకార్యమదొక్కటియేని గల్గెనే?
సన్నికదూరలోకుఁ, డిదె నాతనువెల్లను నీదెగాదె? యే
తెన్నున నేను బోయినను దేవ! జగత్ప్రభు నీ వెరుంగవే? । 63

మ॥ అపరాధంబులొనర్చి కావుమన నాహా యెట్లు రక్షింతువం
చపవాదున్ గలిగించి నిర్దయత నన్నారాటముం బెట్టెదే?
నెపముల్ గల్గకయున్న లోకమున జన్మింపన్ మనుష్యాళికిం
జపదాన వ్రతముల్ హరించునవరే సర్వాపరాధంబులన్॥ 64

ఉ॥ ఇన్నిదినాలనుండివను నేటికి? కష్టములన్ భరింపరా
కున్నను, కావవైతి; వెటులోర్వగనేర్తును? దేవ! నేను నీ

సన్నిధి గోరి వేచితిని శక్తివిహీన, నికేమిచేయుదున్
నన్నిక బాధపెట్టకుము, నాయపరాధములన్ క్షమింపుమా॥ 65
శా॥ దుశ్చారిత్రుఁడు దుర్మదాంధుఁడు కడున్ దోషాత్ముఁడే యయ్యు దా
బశ్చాత్తాపమునొంది పూర్ణమతితో బ్రార్థించెనేనిన్ నినున్
నిశ్చింతిన్ భవదీయ సన్నిధికిఁ జేర్చున్ గదా వాడు నా
శ్చర్యంబగు దేవ నీమహిమ! నన్నేరీతి మన్నింపవే॥ 66
శా॥ ఎందున్నావొ పరాత్పరా కనులనే నేరీతి నిన్గాంతునో
మందాత్మన్ మహిమాన్వితుండ వకటా మాకెట్లు గాన్పింతువో
నాదేహంబగు మందిరమ్ము నవయ్యా ఇక నీసాన్నిధ్యమందుంచి యా
నందం బావథమిత్తువో యిడవో హా! నాభాగ్యమెట్లున్నదో॥ 67
శా॥ తృప్తింబొంద దికేమినేతు నిను నెంతేనిన్ మదిన్ గొల్చినన్
అప్పుండీవెగదయ్యా తెల్పుమిక నెట్లానందమున్ గాంతునో

ప్రాప్తంబింతయు మొప్పదేని నిను నాభాగ్యంబునన్ గందునో
వ్యాప్తింబొందెకు చిత్తమయ్య కృప నావాక్యంబు లాలింపుమా॥ 68

శా॥ పాపిష్ఠుండిక కష్టటంచు నిను నే బాధించినానే ప్రభూ!
పశ్చాత్యమెఱింగి పోతువని నీ సాన్నిధ్యముల్ గోరినా
యత్యంతంబగు దుఃఖమెల్ల నిపుడో యున్నా యెడింగించి కీ
నిత్యానందకరుండవీవగుట నన్నీ వెట్లొ రక్షింపవే॥ 69

శా॥ నాకోర్కుల్ ఫలియింపకున్న జనకా! నాపాలనీవుండ; నా
కే కష్టంబిక నేలగల్గనగు నాకీవే సుఖంబిచ్చినన్
లేకున్నన్ సరిగాని యుండువినుమా లీలాప్రియుండందు నిన్
రాకన్నానన కొన్ని చిక్కులయినన్ రక్షింపు సర్వేశ్వరా॥ 70

శా॥ నీ వేదిక్కుల బెట్టుచున్న నది మేలే యగుం దాన నిన్
సేవింపదగు వేలుగల్గు నది నీచిత్తంబెట్లైనన్ ధృతుల్

శేవంచున్నను వేడుకొందునిక యేరీలఁ ద్వదీయాజ్ఞలఁ
దేవా! నాతలదాల్చి యోర్తునిను ప్రార్థింతుఁ గటాక్షింపవే॥ 71
శా॥ ఏన్నాళ్లీవిధి యేవవుం బ్రతుకుతో నీలోకమం దుందు నో
యన్నా! జూడు మొకింతబిల్లులకు చెర్లాటంబె యైనఁ మహా
పన్నంబై మరణాంతకం బెలుకకుఁ మాబాధయు న్పుట్టెదే
మన్నఁ నీవిటు సృష్టి జేయుటలు నీ కానందమే యైనచో॥ 72
శా॥ నాధారంబిక నీదెగాదె జనకా నా కేల యేదింతయుఁ
నీభావంబది యొట్టులుండు నటులే నీవేలుకొమ్మా ననుఁ
సౌభాగ్యంబులనిచ్చి గైకొనుము నాసాష్టాంగదండంబులన్
సేవానంచు నుతింతు దర్శనమునుఁ శీఘ్రింబు నాకీగదే॥ 73
శా॥ స్వామీ! నామది తెల్వినొంది కదు బశ్చాత్తాపమున్ బొందినీ
పేర్మిఁ గాంచగ గోరుచున్నదిగదా వేగంబె యేతెంచి నా

కాముల్ బాపగదయ్య; నాహృదయ భావంబుం బరీక్షింపుమీ
వేమాత్రంబునుమానముండినను నీవింకన్ రమావల్లభా! 74
ఉ॥ నే కడుమూర్ఖనైతి నిను నిర్దయుడంచు వచించియుంటి హా!
వ్యాకులమొందితిన్ జనక! వ్యాధుల గష్టములన్ గృశించుటన్
నీకరుణారసత్వమును నిర్మలప్రేమయు నెన్నిమారులో
నే కనులారగాంచియును నేడిటు బల్కితి నన్ క్షమింపుమా॥ 75
చం॥ కనులకుగట్టినట్లు జనకా! భవదీయసువిగ్రహంబు నా
మనముననున్నదయ్య కనుమా యనుమానమికేలనయ్య నా
తనువిది నీదెగాదె కడుధన్యుననే నినుగాంచగల్గితిన్
వినుము మరొక్కకోర్కె నిను పిల్చినయంతనె వచ్చుచుండుమా॥
శా॥ అయ్యా! విన్నిక కష్టపెట్ట వలదీనావస్థ నేనుండ నా
కయ్యాలించిమనోరథంబులిడి నాకుంగల్గు దుఃఖాదులన్

నెయ్యంబారఁ దొలంగఁజేయఁగదవే నీపాదముల్ గొల్చెదన్
వెయ్యార్లిచ్చిననిన్నుఁ బోలుసఖుఁడీ విశ్వంబునన్ గల్గునే॥ 77
శా॥ విన్నావో వినలేదొ దేవ యిదెనా విజ్ఞప్తి గైకొనవె నే
నెన్నోభంగుల వేడుచుంటి నకటా యీరేడులోకంబులం
దున్నాడే నినుబోలు దైవ మిక నన్నోదార్పగారావె నే
కన్నీర్గారఁగ దుఃఖవార్ధిమునుగంగా నిట్లుపేక్షింతువే॥ 78
శా॥ నీకన్నన్ గతివేఱు లేదుగద నేనీసన్నిధిన్ జేరితిన్
శోకాబ్ధిన్ దరిగాననైతి నకటా శోధింపగానెంచితిన్
నాకవ్వారలనున్నవారు జనకా నాపాలిప్రభుమిట్లువనే
నీకారుణ్యముజూపకున్న ధరలో నేనిల్వగానేర్తునే॥ 79
శా॥ నేరంబుల్ క్షమియించి నిల్చిమదిలో నీపాదుసన్ జేర్చి నా
భారంబున్ దొలగించి సంచితములన్ భస్మంబుగావించి ని

స్సారంబౌ విషయాదిభోగముల నాసక్తిం దొలంగించి యే
యారాటంబులు లేక దేహము ననాయాసంబునన్ బాపవే॥ 80
మ॥ అమ్మా రమ్మ యిదేటికమ్మ కనులందారీతిగా నశ్రువుల్
గ్రమ్మన్ నాకొరకింత కాలమతి దీక్షం బూనగా నేల న
రమ్మాల్ నేత్రమిదియింతునింక మది నారాటంబులం బాసి హా
ర్యమ్ముల్ బొందుము బిడ్డ వోలె కనులంగాపాడుదం జూడవే। 81
మ॥ అపరాధంబొకయింత లేదు సుత నీయందెట్లుగల్గున్ మహా
జపదానవ్రతశీలవీవు నినునా సాన్నిధ్యమందుంతు నీ
కపవర్గాది సుఖంబులెల్లనిడు దేవశ్రాంతమున్ బ్రోతునం
చిపుడే నాదుకరంబులెత్తి నినుదీవింతున్ మదిన్నమ్ముమా॥ 82
శా॥ దేవా! నీవిటులెంత చెప్పినను నా దేహంబు లేరీతి నా
భావంబందు దొలంగు? గాన యిపుడే ప్రత్యక్షమై నన్ను నే

బ్రోవన్ నేర్తు సుతాయటంచు కరుణాపూర్ణుండవై తెల్పి నా
వేవల్ గైకొని చిత్తగించి మనవిన్ శీఘ్రంబె రక్షింపవే॥ 83
మ॥ ఇపుడే దర్శనమిచ్చి ప్రోవగదవే యీశా! మహేశా! నమో!
చపలత్వమ్మున నిన్నినాళ్లు గడచెన్ చాలింక నే నొల్ల నీ
చపు సంసారపు బాధలెల్ల నకటా సంతాపమున్ జెందితిన్
ఎపుడే తెంతువొ నిన్ను గాంచక కనే నీలోకమందుండనే॥ 84
శా॥ నమ్మంజాలక వల్ల నీదు నుడులన్ నావల్కులాయంటి కో
నమ్మం జేనియు జెందలేక కరుణన్ ప్రత్యుత్తరంబిచ్చి రా
నమ్మాయంచు కటాక్షవీక్షణములన్ యానందమున్ గూర్చి నా
నెమ్మద్కిన్ నిను నిల్పనేర్తు మదిలో నీశా యెఱింగింపవే॥ 85
మ॥ జనకా! నీవె మదీయ నాల్కకొనపై సంప్రీతితో నిల్చి నా
యనుమానంబును దీరిపోవునటు లాహా! యెంతయో ప్రేమ నా

మనవుల్ దీర్చెద శేషశాయి వెరవుల్ మానంగ దేయుంచు నీ
వనవే! యియ్యది నిశ్చయంబుగదవే యం దన్యతంబున్నదే। 86

శా॥ తోలుంగన్నులతోడ నిన్నుగనుటం తో దుర్లభం బాటన
న్నేలా గోమదిగొంత తృప్తినిడగా నీరీతిగన్పించితే
చాలుం జాలు భవత్కృపారసమునన్ సంప్రాప్తనైతీగ భక్తి
లాలా! నిన్నికగోరుదునంచు దెలుపన్ వచ్చ్యుక్తమైనావారో॥ 87

మ॥ కలియుంజాలక పల్కనానుగద యో దేవేశ! నాయందు నీ
వలుకన్ దాల్తువెయెన్న డేని మదికిన్ యారాటమున్ బెట్టితే?
కలుగం జేసిన కీడదొక్కటయినన్ కన్నారగన్నారమే
కలుమం బైమది నీదునాజ్ఞ దొరగన్ కష్టాలురాకుండునే। 88

మ॥ అదియిమ్మా యిది యిమ్మటంచు నినునే నాయాసమున్ బెట్టితిన్
మదినూహింపగనైతి నీదు కరుణన్ మమ్మెట్లు రక్షించిపన్

సదయా! తృప్తి కొకింతలేక చెడితిన్ సర్వాపరాధంబులన్
ఇదిగో నీదు పదారవిందముల సాన్నిధ్యంబునం దెల్పితిన్
గద నీవేమనుకొన్నగాని యికనీ కారుణ్యమున్ జూపవే॥ 89

శా॥ సంతోషించితి నమ్మలెమ్మ సుతనీ సద్భక్తికిన్ మెచ్చితిన్
సంతేనిన్ భయమొందకమ్మ నినునే శోధింపగానింతునే
చింతంజేర్తు యథేష్టమిత్తు మదిలో చింతల్ దొలంగింతు నీ
సంతాపంబిక నేటికమ్మ వినుమా సత్యంబు ముమ్మాటికిన్॥ 90

మ॥ శివుడే కన్పడి తెల్పె నిన్ను నిక రక్షింతున్ సుతాయంచహో!
శివనానందకరంబుగాగ నిక నాజన్మంబు ధన్యంబుగా
భువినా పుణ్యఫలంబులెల్ల నిపుడే పూర్ణంబు నొందెన్‌గదా
యెవరింకేమి యొనర్తురోయనుచు నేనేలా? భయంబందగన్॥ 91

శా॥ ఈకుండె కరుణార్ద్రచిత్తమున నన్నీవేళ రక్షించి మ
త్కష్టంబుల్ దొలగించు నంచు బలికెం గించిజ్ఞనై నే మదీ
యాకాంక్షల్ నీకేటిచింతయని నన్నాశీర్వదింపంగ నా
వేళంబై మది గాయినాండెఱ సుదినంబాగా దినేడంతయున్॥ 92
మ॥ సెలవా! మా॥ దేవదేవ! మదిలో చింతం దొలంగించి నీ
యలుకన్ మాని మనోరథంబులిడి నాకానందమున్ గూర్చి తీ
విలలో నీపరి దైవమెవ్వరిక నోయీకానమస్తే నతే
వలుమారివ్వ్యథిని న్నగల్తునిక నాపాపబద్ధమున్ బాపవే॥ 93
మ॥ భవదీయంబగు దివ్యదర్శనముచే బాలా! భయం జేల ని
న్నవలీలన్ దరిజేర్తు నంచు కరుణాయత్తుండవై పల్కి యీ
భవబంధంబుల బాపి బ్రోవగదవే బాధింపగా బాధమీ
దెవరున్నారు? దయాంతరంగుడవు నీవే యిట్లుపేక్షించినన్॥ 94

శా॥ నాపాపిష్ఠంబదియెట్టులైన నిఁకనా నాకేమియుందోఁచద
దేవా! పాపరబ్ధము దెట్లువీడువకటా యౌదార్యవారెవ్వరో
యేపాపిష్ఠున్ని నన్నమ్మి గొల్తునిఁక నా కేవాంఛయున్ లేదుగా
నీపేరామృతముక్కయింత యిటురానీయంగ నే గోరెదన్॥ 95
ఉ॥ విస్మయమాననిన్ను మది వేడినయంతమహాపరాధముల్
భస్మముచేయనేర్తువని పల్కరువింటిభవత్ప్రభావమున్
అస్మదమోఘదుష్కృతము లారయనేలకృపాంతరంగ! నే
నీస్మరణామృతంబె మది నిచ్చలు గోరెద నన్ క్షమింపవే॥ 96
శా॥ ప్రాణాపాయము పోనైన విర నీ పాదారవిందంబులే
ప్రాణాధారకరంబులౌట నిరు నే ప్రార్థింతు సర్వాంగముల్
క్షీణత్వంబును బొందనీక కరుణాసింధూ! కటాక్షించి న
త్రాణన్నాకు ననుగ్రహించి తనువున్ ధన్యత్వమొందింపవే॥ 97

శా। స్వర్గంబున్ మరిమోక్షమున్ వలదు జీవంబుల్ ననుంబాయుచోఁ
దుర్గానాథ! మదీయవిన్నపము నీతోఁ నొంపరింగింతు నం
వర్గంబుల్ దొలఁగించి యైహికపువాంఛల్ వృద్ధిగానీక నర్గ
మార్గాయానముబొందనీయక యయుష్మత్సన్నిధిం జేర్పవే। 101



ఓం.



# భక్తిరసామృతము.

సాంబశివుని నామో
పాసనమనిశంబొనర్తు భక్తిని సన్నె
గాసియు జెందగనీయక
దోసములెంచకయ కరుణతో ననుబ్రోవన్। 1

కం॥ సాంబసదాశివ! నీపా
దాంబుజములె మదినినిల్పి యనవరతము స
త్యంబుగ వర్తింపగ నా
యంబై దయఁబ్రోవగదవె యత్యంతకృపన్। 2

క॥ శ్రీకరము గు నీస్మరణం
చేకద యిహలోకబంధ మెడపగ, నికనో
లోకేశ! నీకు మ్రొక్కెద
గైకొని నావందనముల, గావవె కరుణన్॥ 3

క॥ ఈశ్వర! నిను వేడెద పర
మేశ్వర నేరముల సైచి యిక నీకృపచే
శాశ్వత మోక్షంబిడి యీ
విశ్వములో వెతల వేగ విడదేయగదే॥ 4

క॥ మా వెతల బాప భువిలో
నీవేగద యొరులుగలరె? నిఖిలాధీశా!
రావే సజ్జనరక్షక!
ప్రోవవె కరుణాలవాల పుణ్యసుశీలా॥ 5

క॥ సత్యవతి, నిన్ను దండ్రిగ
నిత్యంబును వేడుగాన నిర్మలకృపతో
బ్రీత్యుత్కమైన జాలును
సత్యధికంబేమి గోరనైతిని తండ్రీ॥ 6

క॥ పరమేశ! మిమ్ము భక్తిని
నిరతము ధ్యానించుటకును నిర్మలబుద్ధిఁ
వరగున సద్గుణముల నిడి
పరిపూర్ణ కటాక్షముంచి పాలింపఁగదే॥ 7

క॥ సత్యస్వరూప మిమునే
నిత్యంబును వేడుదాన నీపదసేవఁ
అత్యంత భక్తిశ్రద్ధల
సత్యము శాంతాది సుగుణజాలము నిమ్మా! 8

క॥ వదలక మీచరణంబుల
గదలక నామదిని నిల్పగలిగెడి శక్తిన్
చెదరనిభక్తిని ముక్తిని
సదమలమతి నిమ్ము వేగ సద్గురుదేవా॥ 9

క॥ భరియింపజాలదేవా
ధరజన్మ జరామరణ వెతలలో నికనన్
వెరపగుచున్నది బ్రోవవె
బరువగు సంసార మిలను భరియింప నెటో॥ 10

క॥ మీపాదభక్తినేమది
నోపావన గోరుదాన నొప్పగ నికనన్
పాపాత్మయంచు నెంచక
కాపాడవె దీనరక్ష! ఖలజన శిక్షా॥ 11

క॥ అరమర చేయగనేటికి?
ధరణి ననిత్యములుగావె తనువులు దేవా
శరణాగతిగాదె యికనీ
దరిజేరిచి కరుణనేలు తండ్రివిగావే॥ 12

క॥ బంధనల జిక్కినావని
సందేహింపంగనేల జనకా నిన్నే
డెందమున నమ్మి గొల్చెద
నెందుంటివో? నన్ను బ్రోవవేటికో దేవా॥ 18

క॥ ఎందునజూచిన నీవయి
నందే లేకుందువంచు జాలగ భువిలో
నందురుగద యోనదయా
యెందుకు నాకిటుల గోచరింపవు ? తండ్రీ॥ 14

క॥ గతినీవకాదె దాసుల
పతితములెడబాపి బ్రోవ పరులెవరింకన్
సతతము నిను నమ్మితి స
ద్గతి నొసగుచు బ్రోవరావె కారుణ్యనిధీ॥ 15

క॥ అంతశ్శత్రుల వేగమె
వంతము నొందించగల్గు నతిధైర్యంబున్
శాంతాది సద్గుణంబుల
సొంతంబుగ నొసగు చిన్ని సత్యాఖ్య తండ్రీ॥ 16

క॥ నినునమ్మితి నినువేడితి
నినుగొల్చితి నిశ్చయముగ నీవేగురువా
దనఘా! నీవే హరుడవు
తనయను సద్గతినిచేర్చి దయబ్రోవగదే॥ 17

క॥ పరమేశ! నిమ్ముదవ్వగ
పరులను మదినమ్మజాల పాలింపగదే
శరణంటి దాసురాలను
పరమపదం బిమ్మునాథ ప్రార్థింతునికన్॥

21 క॥ కాంచక చేసిన నేరము
లెంచక మన్నించి బ్రోవుమించుకకృప మా
సంచితముల బాపగదే
కించిజ్ఞుల మంచుదోయు కీర్తియొసంగి॥

22 క॥ సుస్థిరుడవైన నిన్గన
కస్థిర విషయములజిక్కి యజ్ఞానముచే
దుస్థితి నుంటిని వేగము
స్వస్థానము జేర్చి బ్రోవు స్వామీ నన్నున్॥

క॥ భావము నందెల్లప్పుడు
పావనము నీదునామ పఠనము సేయం
గా వసుధగల్గు కష్టము
లావంతయు నంటకుండు వరదయగ దేవా!॥ 24

క॥ కష్టంబుల బడనీయక
యిష్టంబుగ నన్ను బ్రోవు మీవరద! కృపా
దృష్టినిగని, యెవ్విధమున
భ్రష్టునిగాకుండ జూడ బ్రార్థింతునిన్నున్॥ 25

క॥ మాయయని తెలియజాలక
హేయము లేవిషయవాంఛలే నిజమంచున్
బాయక పోయిని బాసితి
శ్రేయస్థితి నావగి బ్రోవు శీఘ్రము తండ్రీ॥ 26

క॥ వినయముతో వేడెద నిను
కనుగొన కష్టతను నేను కావించినయే
ఘనమగు తప్పుల మదినిడి
కొని కఠినతబూనకయ సుగుణముల నిమ్మా॥ 27

క॥ దయ నను బ్రోవగరాదే
ప్రియసుత నిటుబాసియుంట ప్రీతియటే? గుణ
త్రయమెటుబాపెదో తండ్రి
భయమయ్యె దయాతిసాంద్ర! పరము మునీంద్రా! 28

క॥ చింతలు దీర్చెదవని నీ
చెంతను జేరితి నన్ను శీఘ్రము బ్రోవ
పంతము బూనగ పాడియె
సంతసముగ బ్రోవదగిన సమయము గాదే॥ 29

క॥ ఎన్నాళ్లకు నీపదముల
కన్నులపండువుగ గాంచగలనో? నేనీ
సాన్నిధ్య మెప్పుడొందెద?
గ్రన్న నమోఘదివ్యరూపు గనజేయగదే॥ 33

క॥ దుర్వార మాయను లోబడి
సర్వేశ్వర క్రియల నొందజాలను తండ్రీ
సర్వము నీవని యెంచితి
శర్వా! సనకాదివరద! సత్కృపతోడన్॥ 34

క॥ అకటా! యెంతని వేడిన
నాకపుడే నీమోము జూపకుంటివి జనకా
యిక నిను గనుగొను టెట్లో
సకలాంతర్యామి యనుట సత్యముగాదో॥ 35

క॥ నీస్మరణ చేసినంతన
భస్మముగావింతు వీవు భక్తులబాధల్
విస్మయముగాదె? జనకా!
అస్మదఘవినాశ యీశ యఖిలాధీశా॥ 36

క॥ సారవిహీనంబగుసం
సారమె తిరమంచు నమ్మి శ్రమలొందుచు వే
సారితి నిక నీదరికిం
జేరితినను బ్రోవరావ! శ్రీ సాంబశివా!॥ 27

క॥ పరమేశ్వర! కరుణాకర!
దురితంబులబాపి బ్రోచుదారి నీవుండగా
పరితాప మొందనేటికి
శరణార్థిని దిక్కునీవె సరగున రావే॥ 38

క॥ ఇదియేమి చిత్రమోగద
మదినీవే దిక్కటంచు మానకభక్తిన్
సదయుడవగు నిను నమ్మియు
వదలని వెతలొందిఁ దుందవలసెను తండ్రీ॥ 39

క॥ ఓదేవ! భ్రోవగానీ
వే, దీనులపాలిదిక్కు వేరిక గలదే
నీ దాసురాలనేగద
నీదయ నాపైనరాదె నిఖిలాధిపతీ!॥ 40

క॥ ఎక్కడనుంటివొ జనకా
మక్కువతో నిన్ను జేరు మార్గ మెఱుంగన్
గ్రక్కున బ్రోవుమనన్నిటు
చిక్కులు బెట్టంగనేమి జేసితి, జెపుమా॥ 41

క॥ శ్రీగౌరీ! నీమదర్పిత
మేగాని నీసుతుల నిటుబ్రోవుదువా! నీ
వేగరి భక్తులకొరకను
వేగము దరిచేర్పవమ్మ వేదతల్లీ!. 42

క॥ అనుమాన మేటికమ్మా
మనమున నీ నామస్మరణ మానముసుమ్మా
నినునమ్మి నారమమ్మా
ఘనముగ రక్షింపుమమ్మ కరుణనుతల్లీ!. 43

క॥ జననీ! నీకై నను నీ
తనయులయెడ జాలిలేదె! తండ్రియుమాపై
కనికరములేక ఏడిసను
జనునే నీపిల్లలేయా? జగతిని తల్లీ. 44

క॥ పుట్టుచు గిట్టుచు ధరనే
నిట్టుల శ్రమలొందుచుండ నెరుగవె? ననుజే
పట్టి దరిఁజేర్పవై తివి
యెట్టులనేనోర్తు? వెతలనికనో తల్లీ!. 45

క॥ నీతనయుల మోహమ్మా
మాతప్పుల నెన్నకింక మన్నించుమనీ
వేతలిదండ్రియు గద యో
మాతా! నీసుతులమాట మరువకుతల్లీ. 46

క॥ అవివేకమున నెఱుంగక
భవ బంధంబులకు జిక్కి బాధల బడుచున్
భువిజన్మ మెత్తుచుంటిని
భవదీయ కటాక్షమున్న బాయవా? తల్లీ॥ 47

క॥ దిక్కులు పెట్టకమమ్మా
యిక్కడ పోయమ్మ మాదు మొరలను వినుమా
దిక్కెవరో యమ్మానీ
వెక్కడ నున్నావొ గాని యెరుగము తల్లీ! 48

క॥ ఓకాత్యాయని భగవతి
నాకేమి భయంబు నిన్ను నమ్మిన వెనుకన్
నాకాయము నాయాత్మయు
నీకే యర్పించితమ్మ నిజముగ తల్లీ! 49

క॥ దానము లెన్నియొ నెరుగక
చేసితి నిర్భకుడనైగి మ్రొగి చింతించితినా
యానము చెందితి వెతలను
వేనటి నీకిట్లు విన్నవించితి దల్లీ. 50

క॥ కలవా! నాపాలిట రా
గలవా సమయంబునెఱిఁగి కాపాడఁగనీ
గలవా గలకోర్కెలం నీ
విలలేవా? మాకుముక్తి నీవాతల్లీ. 51

క॥ చిన్నతనంబున నేరము
లెన్నన్నో చేసియున్న నేటికి? నేనీ
సన్నిధిఁజేరితి నేటికి
మన్నింపవె దిక్కునీవె మాకికతల్లీ. 52

క॥ మొరలను వినవో? సకలము
నెఱిఁగియు నను వెతలబెట్ట నెంచితివో యీ
గిరిరాజతనయ నీవిటు
లరమరసేయంగ న్యాయమా నే తల్లీ. 53

క॥ వృజినంబుల నెడబాపవె
భజియించెద నీదు పాదపద్మము లెదలో
నిజభక్తవరుల నేలఁగ
రజతాద్రిని నుండ నేల? రావే తల్లీ. 54

క॥ ఇలనీకన్నను వేరే
గలరే నినునమ్మువారిఁ గాపాడుటకై
పిలిచిన రాకుంటివి నీ
పలుకే బంగారమాయె పరులకు తల్లీ. 55

క॥ దీపపుకాంతిని చీకటి
రూపము లేకెటులఁబోవు చూడఁగనటులే
పాపముగ నీదయగల్గిన
నాపాపములెన్నున్న దొలఁగుననవనిని దల్లీ. 56

క॥ అతులితము నీభక్తిని
పతితములు నశించి మోక్షపదవియు గల్గున్
మతినిన్ను గొల్తునోశివ
పతియెవ్వరు నీకు పతిత పావనితల్లీ. 57

క॥ క్షితిపై క్షణభంగురమా
బ్రతుకని వివరింపలేక భ్రాంతికిలోనై
వెతలొందుచుంటి వేరే
గతిలేక కనులగాంచి గావుముతల్లీ. 58

క॥ తనయను నేనినువేడగ
ననుమానించెద వదేల? యమ్మా నీకే
కనికరము లేకయుండిన
జనునకింకెట్లుగల్గు చయ్యానతల్లీ. 59

క॥ నీవైన జెప్పకుండిన
నేవిధి నను బ్రోవగలడో? యేమరినాడో
నావిధియెట్లుండెనో నను
బ్రోవగ నింకెవరుగలరు పుడమిని తల్లీ. 60

క॥ లోపా టోపములున్నను
గాపాడవె నన్ను వేగ కరుణను తల్లీ
యేపాప మెరుగనమ్మా
నీపాదములాన నిన్ను నే విడగలనే 61

కం॥ జీవా! హరుని భజింపగ
లేవా? నుంతైన బుద్ధిలేదా? యికనీ
కీ విశ్వమందుదాతయు
దైవంబును వేరుగలరె? దరిచేర్పుటకూ. 62

క॥ మనమా! నాదోకమనవిని
విమమా! యిహలోకవాంఛ వీడుమభువినెం
దున సౌఖ్యమేమిలేదని
గనుమా దైవంబుకన్న గతిలేదుసుమా. 63

క॥ శాంతము సద్భూషణమా
శాంతము విడనాడ సకల సౌఖ్యములుడుగున్
శాంతస్వరూపులౌ దు
ష్ప్రాంతులె సర్వేశు బొందజాలుదు రవనిన్. 64

క॥ మరణంబు తప్పదెన్నడు
ధరణి ననిత్యములుగావె? తనువులు గానన్
అరనిమిషమైన నెప్పుడు
పరమర చేయంగగూడ దాత్మజ్ఞులిలన్. 65

క॥ తెలిసియుఁ దెలియని నరులిల
వలిఁ జెడి నిందలఁ బొరక సర్పభయము నని
శ్చల ధైర్యమూని శ్రీహరి
గొలిచెడి సజ్జనులు వరముఁ గొందురు మనసా! 66
క॥ పరూపున ధ్యానించిన
నా రూపముతోఁ దర్శనంబిడు శ్రీమన్
ఏ రుచులకన్న శ్రేష్ఠం
బీరుచియే యంచుభక్తి నెరుగుము మనసా! 67
క॥ అగణితముగ బోధింతుము
భగవంతుని బూర్ణమైన భక్తిన్ సతమున్
దగు నిర్మల భక్తియె కలి
యుగమున మోక్షంబు నొంద నుత్తమపథమా. 68

క। సంతోషమూరె జనకా
స్వాంతంబున కింక నీవు సత్కృపతో నా
వంతల బాపుచు నుంటివి
యింతటి కరుణాకటాక్షమెటుకగల్గున్. 69

క। దేవా! నమోస్తువా నిను
సేవింతును కరుణతోడ శిక్షింతువొకో
నీ వెఱుగని దేమున్నది
కేవిధి జేసినను నాకు నిష్టమె తండ్రీ. 70

క। కటకట దైవమ! యిక నా
కెటు బోదిన బంధనంబె యే మొనరింతున్
పటుతరమగు కృపనేలుము
మటుమాయం జేసుగాదె మాయభ్రాంతుల్. 71

క॥ కష్టంబుల బెట్టుట నీ
కిష్టంబైన వానికేటికి వెరువన్
స్పష్టంబుగ జెప్పెదనే
నష్టంబును లేదు నిన్ను నమ్మిన వెనుకన్. 72

క॥ భగవత్స్వరూపమునని
జగతీస్థలి సర్వభూతజాలములోనన్
దగ నివసింతువుగాదే
నగుణుడవని నీవు సేవసల్పెదతండ్రి. 73

క॥ ఏటికి నాకీతనువిది
బూటకమేగాని నిల్వబోవున సతముగా
మాటికి నినువేడెదనే
నాటికి నీకనులగాంచి నన్నేలెదవో. 74

క॥ వంతనివేడిన నీదయ
సుంతయు నాపైనరాదు చోద్యముగాదే
యింతటివాడవనుచు నా
స్వాంతమునం దెన్నఁడెఱుఁగజాలను తండ్రీ. 75

క॥ నాలోపంబుల నెంచక
మీలోకంబునను జన్మమెత్తిన దాదిగ్
జాలనొనర్చిన నవి యిపు
డేలా? యఘహరుడవాట సెఁగితి నిన్నున్. 76

క॥ పాతలెన్ని గలుగనున్నను
మతిలో నీస్మరణ జేయుమాత్రిననాపై
పతులితమౌ కారుణ్యా
మృతమును గురిపించిగోవ సేతువుదేవా. 77

క॥ యమబాధ లడపుమని యా
నమయంబున నిన్నువిల్వ జాలనొ గలనో
క్రమమే నేనటుచేతునొ
క్రమముగ నిన్నిపుడె గొల్తుగావవె కరుణన్. 78

క॥ ఏపని చేయుచున్నను
నీపద చింతనము విడను, నిజముగ నాకే
యాపద గలుగగనున్నను
నీపూర్ణ కృపాకటాక్ష నియతిని దొలగుగా. 79

క॥ సంసారము నిస్సారము
హింసా రూపకమటంచు నెఱిగియు భువిని
సంసారులెల్ల పాప
ధ్వంసుని సర్వేశునిన్ను దలపరుగాదే. 80

క॥ నీసాన్నిధ్యము గోరితి
వేసారితి నిన్ను జాలవేడితి నైన౯
గాసిలజేయుచు నన్నా
యాసము బెట్టంగ న్యాయమగునే జనకా. ౮౧

క॥ నాకొలఁత దీర్చవైతివి
యేకోర్కుల నింకఁగోర నేటికివృథగా
నీకరుణ లేకయుండిన
నేకార్యంబైన గాని యీడేరునొకో. ౮౨

క॥ విఖ్యాతయశుడ నీతో
సఖ్యమువని నరుడు ముక్తి సాధింపడొకో
సౌఖ్యంబు లింక గోరను
ముఖ్యంబౌ కోర్కె యొకటె మోక్షంబిమ్మా. ౮౩

క॥ నీ యిష్టముగాకూడిన
నే యంశంబైనగాని యేవిధినైనన్
జేయంగా శక్యంబే
నామొద భక్తిమగాక యేమునర్తును తండ్రీ. 84

క॥ ఓ జగదీశ్వర నాకీ
నిజన్మంబునకు సౌఖ్యమెట్టుల గల్గున్
పూజింతునయ్య నిను ని
ర్వ్యాజకటాక్షమున బాధ లడఁగింపఁగదే. 85

క॥ మోహాపేక్షను నేనీ
దేహంబున కేరించు భావింపకు మీ
రక్షించిన శిక్షించిన
నీకిఁక నిన్నే భజింతు నెట్లైన హరీ. 86

క॥ నిర్మలభక్తిని నిన్నా
ధర్మార్థ సుఖంబులెల్ల దానవె గల్గున్
చర్మాంబరధర పుర్వ్యాకృతి
కర్మలనడచావ కరుణ గలదో లేదో. 87

క॥ కలదో లేదోయని మది
దలచితినని తప్పుగాగ దలపకు దేవా
అలనా శిఖరాశేందుధరు
కలదో లేదో యటన్న గావవె కృపతో. 88

క॥ నీవే దైవమ్మనను
భావమునను నిన్ను నమ్మి భజియించెదు నీ
సేవకుల కోర్కెదీర్పగ
లేవో శోధించుటయును లీలయొసీశా. 89

క॥ చనువున విన్నమనినను
మనమున నెంచంగఁబోకు మరియొకరీతి౯
నినునే నెఱుగను నీవిటు
కను మరగితివేల బ్రోవఁగలిగియు దేవా. 90

క॥ రోషంబున నంటినొ సం
తోషంబున నంటినో బదులువల్కవు నా
దోషంబు లెన్నదవె నను
బోషింపఁగరావె పుణ్యపురుషా శ్రీమన్. 91

క॥ సర్వాపరాధములకును
సర్వేశ్వర! కేలుమొగిచి సాగిలబడు దే
ఉర్విని దాసుని తప్పులు
శర్వా! దండంబుతోడ సరియగుననరే. 92

క॥ ఎవ్వండు నిన్నఁగొలుచుట
మెవ్వన్కై కాదుదేవ యీకృపకొఱకే
తవ్వలికేటికి వెదకెదు
నివ్వటు వెదలంటునొక్కో నిర్మలరూపా. 93

క॥ ఎన్నోరీతుల వేడితి
నన్నియు వెడచెవినిబెట్ట నర్హంబగునే
యున్నాఁడో లేఁడో యని
నిన్నెరుగని వారలందు నిజముగను హరీ. 94

క॥ ఉన్నాఁడో లేఁడో యని
మున్నొక భక్తుండుబల్కు మోహంబిడువే
నన్నేల వెతలబెట్టెదు
యున్నావని నిన్ను నమ్మియుంటిని దేవా. 95

క॥ కన్నన బ్రోవగలేవే
నిన్నెవరు గొల్తునయ్య నీవేగతి యా
పన్నను నేఘుక్కృతినో
యన్నా! నన్నేలకున్న నన్యులుగలరే. 96

క॥ యెన్నో కష్టంబులురా
నున్నవి నాకనుచు దోచుచున్నదిమదిలో
యన్నా నీకృపయున్నను
నన్నియు విడివేగ మోక్షమందగలేనే. 97

క॥ మానవమా! తిరువరమా
కానున్నది కాకపోన కర్మానుగతిన్
రానున్నది రాకుండున
ధ్యానింపుము యీశునతడె దయతో నేలున్. 98

క॥ అవతారంబుల దాల్చితి
వవనీభారంబుదీర్చి యార్తులబ్రోవన్
భువనత్రయముల నీసరి
యెవరింక, భవన్మాహాత్మ్య మెఱుగంగల మే. 99

క॥ నావారనువారనగువా
రేవారును లేరు బుద్ధినెఱుగక చెడితిన్
నీవే నావాడవునా
కీవే పరార్థములును యిహపరసుఖముల్. 100

క॥ జగతిని ధర్మంబెప్పుడు
దిగనాడి జనంబులెల్ల తెగనీల్గుదురో
జగముద్ధరించనప్పుడె
యుగయుగముల జన్మమొందుచుందువు దేవా. 101

క॥ మర్త్యాగ్రవర్తులై స
త్కర్మలవిడి జనులు నిన్నుగనలేనితఱిన్
నిర్మల కృపతో భువి స
ద్ధర్మము నెలకొల్ప జన్మదాల్తువు దేవా. 102

క॥ వరమిమ్మా దేవా నే
పరమానందంబుతోడ పరలోకమునన్
చిరసుఖముల బొందియు తుది
జరయు మృతియు బాసి నీసన్నిధి జేరన్. 103

క॥ వరమీవే దేవా నే
మరణావేదననునిన్ను మఱవక నీదా
స్మరణామృతమే గ్రోలుచు
నిరయంబును దాటితుదిని నిన్నే జేరన్ 104

క॥ దేహేంద్రియములు సడలక
సాహసమున తిరుగుచున్న సమయమునందే
ఊహాపోహలు దొలగుచు
మోహంబునబడకమున్నె మోక్షంబియవే. 105

క॥ సోహంబనినను జేరితి
దేహపటుత్వంబు నాకు దీరకమున్నే
శ్రీహరిహరరూపా సం
దేహింపక నీదుసన్నిధిని జేర్పగదే. 106

సంపూర్ణము.

---

ఓం.

# భక్తిరసామృతము.




శ కైలాసవాస గౌరీశ యీశ
నిత్యమంగళదాయకా నీకుశరణు
శ్రీమహాదేవ నీపాద సేవకులము
సర్వలోకైకనాయకా శరణు శరణు. 1

గీ॥ భువనములనెల్ల బాలించు పుణ్యమూర్తి
పరమభక్తులపాటింటి భద్రమూర్తి
సకల కల్యాణగుణమూర్తి సాంబమూర్తి
కేళికరుణచే మమ్ము రక్షించుగాక. 2

గీ॥ చంద్రశేఖర నిన్నాత్మయందు నిల్పి
నిత్యమూనసక్తితోడ ధ్యానించునటుల
భక్తిశ్రద్ధల నీగదే పరమపురుష
యిదియె నాయాప్సితములవి నీయవే. 3

గీ. చంద్రశేఖర నీదివ్యచరణములను
నమ్మి దిక్కునీవనియున్న నన్ను బ్రోవ
రావె దీనుల రక్షించు రక్షకుడవు
తనయుపైనింత చలమూన దగునె నీకు. 4

గీ॥ నీలకంఠ నాదు నేరంబులెన్నక
కరుణతోడనన్ను గావుమయ్య
కూతురెచటనైన గుణవతి గాకున్న
తండ్రిబాయునొక్కొ దయను దొలంగి. 5

గీ॥ చిన్ననాటనుండి యెన్నెన్నొ విధముల
నిన్ను వేడుచుంటి కన్నతండ్రి
నీవె నాకుతోడు నీదయు నిఖిలంబు
దిక్కు నీవె కావె? దేవదేవ. ౬

గీ॥ సకల సౌఖ్యంబులొసగు రక్షకుడ వీవె
పెక్కు దిక్కుల బెట్టినా దిక్కు నీవె
దయను నన్నేలువాడన్నను తండ్రి వీవె
పట్టియున్నాను నీపాదపద్మములను. ౭

గీ॥ అన్ని సౌఖ్యంబు లిమ్మంచు నడుగ లేదు
కోరికల దీర్చుమని వేడుకొనగ లేదు
కోరితిని నిన్ను నామనసార నొకటి
సుతులమని మమ్ము నీప్రేమ జూడుమయ్య. ౮

గీ॥ అన్నిసౌఖ్యంబు లిమ్మంచు నడుగనేల
అనఘ! మాకన్నతండ్రివే యగుదువీవు
గాన నిన్నేమి మేమడుగంగవలయు
నెఱుగవా? తండ్రిబిడ్డలందిడెడిప్రేమ. 9
గీ॥ స్వామి నీయందు భ_క్తి విశ్వాస మిచ్చి
దయను సాక్షాత్కరించిన దనివితీరు
ధన్యురాలనౌదును తండ్రి తనయుపైన
నింతమాత్రి మనుగ్రహ మేలరాదా? 10
గీ॥ ఈశ! నీ చిన్నితనయనం చెంచియుంటి
నాపదలవెల్ల గరుణతో బాపుమంటి
సతము నీపూర్ణకృపలేక సతలగంటి
నన్ను రక్షింపు మీశ! నిన్నమ్మియుంటి. 11

ఆ॥ నీవు కన్నతవయ నిను గాంచగోరిన
చూపోనంగ వేల? పాపహర
పతితపావనుండు భక్తవత్సలుడన్న
బిరుదముండుటైన నెఱుగవొక్కొ. 12

గీ॥ అచల పరిపూర్ణ సమ్మోద మందజేసి
తుచ్ఛవిషయంబులందాశ దొలగజేసి
జరయు మృతిలేని శాశ్వత సౌఖ్యమిచ్చి
మోక్షసామ్రాజ్య పదమిమ్ము ముదముతోడ. 13

గీ॥ సాధుపోషకుడనుపేరు సత్యమైన
మూడుజగములకును నీవె మూలమైన
నార్తులనుబ్రోచుటకు నీవె కర్తవైన
నన్ను రక్షింపకుండుటే న్యాయమయ్య? 14

గీ॥ రాముడట లంక నిచ్చెడి క్షేమమొందె
వల భగీరథుడునుగొల్చి ఫలముగాంచె
పార్థుడును నిన్నునమ్మి కృతార్థుడయ్యె
తనయుడౌ నన్ను బ్రోవంగ మనసురాదె
భవ్యలోకేశ సర్వేశ భవవినాశ!. 15

గీ॥ వలదు వలదన్న వాంఛల న్వదలబోదు
విడువు మిడుమన్న దుర్బుద్ధి వీడబోదు
తలపు నీపై నిలుపుమన్న నిలుపబోదు
అయ్య యీమది చర్య లేమందునింక. 16

గీ॥ అన్యవిషయంబులందు మోహమున సతము
మరిగి దరిగానలేని నామానసంబు
నేరకయె జేసినట్టి యేనేరమైన

సైచిమన్నించి కృపయుంచి క్షమముదాల్చి
నీదు చరణారవింద సన్నిధిని జేర్చు. 17
గీ॥ అభయ హస్తంబునిడిబ్రోచు ప్రభుడవీవు
దాసులకు మోక్షమిడిబ్రోచు దాతవీవు
ధరణి బ్రత్యక్ష దైవమై తనరినావు
తప్పులెన్నక నన్నేలు తండ్రినీవు. 18
గీ॥ ముక్తిదాయక! కారుణ్యమూర్తివగుట
నన్ను వేగమె కొనుమనీ సన్నిధికిని
ఖలులమనిబాయ నీమది దలపకయ్య
తొల్లి దుష్టులనేలిన దొరవె కాదె. 19
గీ॥ అన్నివిధముల నీవ తోడౌచుమాదు
కష్టసుఖముల నెరుగుచు గరుణతోడ

నాదరింపంగవలెగాక యన్యమార్గ
మెందుగలదయ్య యీలోకమందు మాకు. 20
గీ॥ పరులు నావార లను భేదమరయనీకు
గలదె? యెరికి సముడవుగావె నీవు?
నీవె మము నిర్దయనుజూచి బ్రోవకున్న
గతియికేదయ్య మాకీజగతిని జనక!. 21
గీ॥ కీడులోనన మేలొనగూడుచుండు
కష్టములువీడ సౌఖ్యంబు గలుగుచుండు
మేలుకీళ్లను వెనువెంట మెలగుచుండ
నిన్ను నిందింతురక్కటా నీతిలేక. 22
గీ॥ తండ్రి నినునమ్మినందుకాతనయునిట్లు
సర్వసంకల్పములను నిష్ఫలముజేసి

వ్యర్థరాలను జేతువో వసుధలోన
నిన్ను మనసార బ్రేమించి యున్నఫలము? 23

గీ॥ కన్నులారంగ నినుగాంచ గల్గుభాగ్య
మున్నదో? లేదొ? నాథ నో కన్నతండ్రి
తనయ రమ్మంచుమన్న నీదాపుజేర్చి
కొలది కరుణించి కన్నులు చెన్నదింక? 24

గీ॥ జన్మజన్మంబులెత్తి వేసారిజాల
నింక నిహలోకవెతల భరింపజాల
ముక్తినీవయన్నిట నేనశక్తురాల
నైన మన్నింపవే? కరుణాలవాల. 25

గీ॥ ఎందుజూచిన యానంద మింతలేదు
కష్టములెగాని సౌఖ్య మెక్కడను లేదు

మాయ ప్రపంచమిది దీన మనసు లేదు
తండ్రి! దుఃఖాబ్ధి నను ముంప దలువకయ్య. 26
గీ॥ లేశమైనను సుఖమిందు లేదు లేదు
ఇట్టి ప్రపంచమున నుండ నిచ్ఛ లేదు
శ్రమలబడుచిట్టు లోర్వంగ శక్తి లేదు
నీ వుపేక్షింప తనువిఁక నిలువ లేదు. 27
గీ॥ కాలమిఁకిటు గడువంగ గలదె? ఫలము
ఎన్నటికి నన్ను దరిజేర్ప నెంచ లేదొ
విన్నగాని యికనొక్క నిమిషమైన
నెట్లు నిలుతును తండ్రి నీవిట్లు జేయ. 28
గీ॥ మొరల వినుచుంటివో లేదో? యెరుగగాని
యెన్నివిధముల నిను వేడుకొన్నగాని

కరుగదేమయ్య నీమది కరుణలేదా?
సదయుఁడవు నిర్దయుఁడను బూనఁజనునె? నీశ॥ 29
గీ॥ విద్యగలదని మదిని గర్వింపలేదు
కలిమి గలదని నీ సేవదొలగలేదు
తనువునే నిత్యమని మదిదలపలేదు
నన్ను రక్షింపవిక తప్పులెన్ననేల? 30
గీ॥ ఎంతవేడిన దయరాదు పంతమేల
కొంతిని నిన్నునాతండ్రి) కోపమేల
పిలిచిననుగాని బదులైన బలుకవేల
తనయుపై నింతకఠినంబు దాల్పదగునె? 31
గీ॥ ఎందరెందరో భక్తులనేలినావు
ఎట్టివారలనైన జేపట్టినావు

కరుణ నాపైన లేదేమొ? కాని జనక
నీకు నన్నేలభారమా? నీలకంఠ. 32

గీ॥ భువనరక్షక నీ ప్రియపుత్రినగుచు
జనక! నీయంతవానికి తనయనయ్యు
పుడమి పడరాని యిడుమల బడుచునిట్లు
పరుల సాహాయ్యమును గోరవలసె నకట. 33

గీ॥ దివ్యమంగళవిగ్రహా! దేవదేవ!
అఖిలలోకేశ యీశ మహానుభావ
పతితపావన నీప్రియ సుతులగావ
రావ? నీ సేవకులము దిక్కీవె గావె? 34

గీ॥ వేడువారల రక్షించువాడవేని
కరుణయనునది నీమది గలిగెనేని

అనఘ! మేము నీబిడ్డల మగుదుమేని
శీఘ్రమే మాకు మోక్షమిచ్చెదవుగాక. 35

గీ॥ తెలిసికావించియుంటి తప్పులనుగొన్ని
నేరక మొజేసితిని గొన్ని నేరములను
పతితపావన! నీ ప్రియసుతనుగాన
దయనునన్నట్లు మన్నింపదలచినావొ? 36

గీ॥ ఎన్నటికి నాదుతప్పులే మెన్నచున్న
దయను మన్నించి నన్నేల దలపకున్న
నీకటాక్షంబు నాపైన నిలుపకున్న
నిలను నేనిట్లు జీవింపనేటికన్న. 37

గీ॥ మమ్ము కృపనేలుమని బ్రతిమాలుకొంటి
వెతలబడజాలమని విన్నవించుకొంటి

నార్తరక్షకుడ వనిది నీకీర్తి వింటి
నిట్లుపేక్షింతు వనుట నే నెరుగకుంటి. 38
గీ॥ ఉర్వి నే సౌఖ్యమైన లేకున్నగాని
జనక! నీ కృపారసమున్న జాలునంటి
నిదియు కరవాయె నేటి కే నేమనందు
నిహపరంబుల నొకటైన నీయరాదె? 39
గీ॥ తనయులీరీతి వెతలొంద దలపవైతి
వేడుకొన్నను కనులార జూడవైతి
మొంతపిల్చిన దర్శనంబీయవైతి
యేదనున్నావొ? నీజాడ నెరుగనైతి. 40
గీ॥ అఖిలరక్షకరక్షకములనో యాదిదేవ
మొందుజూచిన నుందు లేకుందువుగద

నిన్ను గాంచంగ నిచ్ఛ జనించునయ్యా
నామనోరథ మీడేర్పవేమి? తండ్రి! 41

సీ॥ నిత్యమౌ నిర్మల సమాధినిష్ఠఁ బొంది
యద్వితీయ పరబ్రహ్మమందుఁ జెంది
ఐక్యమై వట్టి ఘనులమ్మ యాత్మలకును
భూరిసామ్రాజ్య పదవేల? భువనపాల! 42

గీ॥ శాంకరీ! నన్ను బ్రోవంగ సమయమమ్మ
ఇంకనైన నను కరుణించి యేలుమమ్మ
తల్లి! నీ బిడ్డలను బ్రోవ ధర్మమమ్మ
పరమపదమిమ్ము నినువమ్మ బ్రతుకనిమ్ము. 43

గీ॥ కరుణతోడను నీపాదకమలములను
తల్లిరో! జూపగదవె నిన్నెల్లమందు

నమ్మిగొల్చెడి నీదుభక్తవర్యులనిట్లు
విడచియుండుట నీకిది వేడుకగునె. 44

గీ॥ జనని! యీ ఘోరసంసారజలధియందు
దరికిజేరెడిమార్గంబు దొరుకలేదు
ఎవరు నీచెంతజేర్పంగ నెంచితమ్మ
నిన్నువిడనాడి యెన్నాళ్లు నిలతునమ్మ. 45

గీ॥ ఎన్నిచిక్కులబెట్టగ నెంచినావొ
నామొరాలింపకున్నాడు నాదుతండ్రి
జనని! నీవైననాచిన్ని మనవిగొంత
విన్నవింపవె తండ్రితో విసుగుగాక. 46

గీ॥ తల్లి! నీవైనదెల్పవే తండ్రితోడ
దీనురాలను నాకింక దిక్కుగలరె

తల్లి కరిప్రేమ సుతులపై తండ్రికన్న
అనెడి లోకోక్తి నెరుగవా? యమ్మనీవు. 47

గీ॥ తల్లి నీదుపాదార విందములు దక్క
నాకు భవసాగరంబీదు నావవేరు
గలదె? నీవెనాపైనిట్టు లలుకబూన
నెందుజొత్తును జనని! నాకేది దిక్కు? 48

గీ॥ పలువిధంబుల దిక్కుల పాలుజేసి
మనము నామాటవినకిట్లు మసలుచుండు
నీయనుగ్రహ మొక్కింత నిలుపకున్న
నిలువ నీదమె లేదుగా నిక్కముగను. 49

గీ॥ జనని! నీకటాక్షంబున్న జలదమట్లు
మొల్లయిక్కట్లు గడియలో నెగిరిపోవు

నీవు పెట్టింతువేని యీ నీచబ్రతుకు
బ్రతుకజాల్లను భువిదుఃఖ భాజనంబు॥ 50
గీ॥ శంకరుని దివ్య పాదాంబుజముల నెపుడు
మదిని నిష్కళంపుభక్తితో స్మరణజేసి
జన్మసాఫల్య మొనరింప జనును భువిని
జననమొందిన వార లేజాతివైన. 51
గీ॥ ఇందుశేఖరు పాదార విందసేవ
భక్తితో జేసి యీభవ బంధములను
వీడి యానందవార్ధి నోలాడువార
జన్మయే సార్థకంబన జనును జగతి॥ 52
గీ॥ దేవదేవుడెల్ల తావులందుండంగ
తీర్థయాత్రలనుచు దిరుగనేల?

చపలచిత్తమునను జనుచుందురే గాని
యుందుగలుగు దేవుడిందు లేడె? 53

గీ॥ అనుభవించగవలెగాక యనివార్యిత
ఫలము సుంతైనదప్పింప గలరెభువిని
రాజవరులైన పరమవిరాగులైన
దామువర్చిన కర్మంబు దాటవశమె? 54

గీ॥ దైవసంకల్పములు విధిలిఖితములుగావె
కోరకయె పెక్కుమేళ్ళనగూర్చుచుండు
తెలియకుండను పెక్కుచింతలను దెచ్చు
భక్తవత్సలుడైన శ్రీపతిగుణముల
మనుజమూర్తులకెఱుగ సామాన్యమగునె.? 55

గీ॥ ఎందరెన్నివిధంబుల నిందఁజేసి
తన్నుదూరుచునున్నను ధైర్యమూని
తనదుపట్టునువిడక సత్పథమునందు
జనుచు నినుఁగొల్చుభక్తుండు గను నపరము. 56

గీ॥ ఫలసమృద్ధివివృతంబు వంగియుండు
నట్లు సద్గుణంబులచేత నణఁగియుండు
నిర్మలుండై పవిత్రుఁడై నెగడవలయు
సుగుణవంతుని కిహపరసుఖముగాదె. 57

గీ॥ ధరణిసజ్జనస్నేహంబు దొరకకున్న
చేయవలెను మరి యెట్టిస్నేహమైన
దుష్టులనుగన్న భయమంది తొలఁగు మెపుడు
నోర్పుగలవాఁడె బలవంతుఁ డుర్విలోన. 58

గీ॥ తాను కించిజ్జ్ఞుడయ్యును దర్పమునను
సర్వమెఱిగినయట్టి సుజ్ఞానివోలె
భువినటించుట నీచునిబుద్ధిగాదె
అవని సర్వజ్ఞుడైయుండు నాత్మ విదుడు. 59

గీ॥ ఎట్లువచ్చితిమో యట్లె యీజగంబు
విడచెదముగాన నరులార! వినుడిమీరు
మోహపాశంబులనుజిక్కి మోసపోక
తెలివిగల్గిమెలంగుడీ! కలుగుముక్తి. 60

గీ॥ క్షితితలంబున మనయొక్క బ్రతుకులెల్ల
దలప క్షణభంగురంబెగాఁ దెలిసికూడ
చేలరై తుచ్ఛవిషయాది లోలురగుచు
బంధనలజిక్కి బాధల పడుటమేలె? 61

గీ॥ దేవదేవునిగనుటకై తీవ్రమైన
భక్తివైరాగ్యములబూని పాటుబడుడి
ఉర్వి నీజన్మనే ముక్తి నొందునటుల
ఘనతరంబగు శ్రమ లొందగావలయును. 62

గీ॥ న్యాయమార్గంబునను నీవు నడతువేని
శ్రీశుడెప్పుడు సాయంబు సేయుచుండు
అరసి యేక్షణంబునకద్ది యావసరంబొ
నరిత మట్టిమేలును ప్రేమనలుపునతడు. 63

గీ॥ సంశయంబులుగల్గిన క్షణములోన
దీర్చుకొనుచుండుమెప్పుడు తేటపడగ
పేశనముజేయ వలదిల నెవరినేని
అన్యమతముల ద్వేషింప నఘమునుండు. 64

ఆ॥ దానమిచ్చువాఁడు ధర దరిద్రుఁడుగాఁడు
యిచ్చుకొలఁది సిరులు హెచ్చుచుండు
బీదసాదనరసి యాదరించుటకన్న
ధనమునంగుగాదె దైవమెపుడు. 65

గీ॥ అవని "సత్యమేవజయతి" యండ్రుగాదె
సత్యమే దేవుఁడౌట నిజంబుగాదె
దానినే జీవనముగ నాధారముగను
దలచువారలె భువిలోన ధన్యతములు. 66

గీ॥ అరయ సత్యస్వరూపుఁడౌ యాదిగురుని
సత్యనిష్ఠాపరుఁడ బొందఁజాలుగావ
భువినిగలనైన బరిహాసమునకైనన
నసృతమాడంగ దగదెట్టి యవసరమున. 67

గీ॥ సత్యమునుమించు ధర్మంబు జగతిగలదె
దానికన్నను రక్షించు దైవమున్నె?
యనుభవంబున నెరుగంగ నగునుగాని
దాని మాధుర్య మహిమను దరమె తెలుప. 68

ఆ॥ పరులమెప్పుగోరి పరమేశు నర్చింప
ఫలము నుంతయేని గలుగబోదు
దైవభక్తిలేక తరియింపజాలము
తెలియ తైలరహిత దీపమట్లు. 69

ఆ॥ భగవదాజ్ఞలకును వ్యతిరిక్తమైనట్టి
నరులయాజ్ఞ నెపుడొనర్పబోకు
జగతిబూర్ణభక్తి సజ్జనస్నేహంబు
ముఖ్యసాధనములు మోక్షమునకు. 70

గీ॥ భువిమనశ్శుద్ధితో నీవు పూజసేయ
దయను బ్రోచును దైవంబు తప్పకుండ
భక్తిగలవారి కందు రెప్పటికైన
రూఢిగా దేవుని నిజస్వరూప విధము. 71

గీ॥ శాశ్వతంబైన భక్తివిశ్వాసములను
నిశ్చల ధ్యాననిష్ఠయు నీస్మరణయు
దేవ! నాకిమ్మటంచు ప్రార్థించుమెపుడు
భక్తిగలవారి కెందైన భయముగలదె. 72

గీ॥ అవనిగల్గిన యెల్లవస్తువులకంటె
మిగులభక్తిని హరిని ప్రేమింపవలయు
బ్రతిఫలంబును గోరక భక్తితోడ
గమలనాభుని భజియింప గలుగు ముక్తి. 73

ఆ: జ్ఞానశూన్యుడగుచు శతవత్సరంబులు
బ్రతికనేని దాన ఫలితమున్న
జ్ఞానవంతుడగుచు జగతి నొక్కదినంబె
యున్నగాని నదియె యుత్తమంబు. 74

గీ: అన్నిటను దేవుడున్నాడటంచు నెపుడు
మిగుల బ్రేమించుటయె భక్తియగును చూడ
నిఖిలజగముల నాతడేనిండియుండు
గాన తెలివొంది దుర్మార్గకార్యములను
మరుగుగానైన జేయకు మరచియైన. 75

ఆ॥ ఆత్మసౌఖ్యమెప్పు డనుభవించెడివారు
విషయసౌఖ్యములకు వెదుకబోరు

మాయజగమటంచు మదినెంచివిడతురు
వారికేల యొట్టి వైభవములు. 76

గీ॥ విషయము లపాయకరములు విషమువోలె
ఆశయే పిశాచమువంటి దరయభువిని
ధనము వైశ్వానరజ్వాల కెనయగునుమ
మోహపాశము వల యిది యెంచి మోసపోకు. 77

గీ॥ విషయసుఖమను లేడిని వెంబడింపఁ
గల్లసంసారమను ఘోరకాననమున
విడచిపెట్టునుత్రోవను వెదుకలేక
తల్లడిలు తుదకాజీవి యొల్లగతుల. 78

గీ॥ జగతి భార్యను ప్రేమింప శక్యమగును
హరిని బ్రేమింప దరముగా దల్పులకును

దలప జతి శవంబులగాల్ప గలుగుగాని
చింత ప్రాణులనైన హింసించుగాదె.

ఆ॥ అన్నదమ్ములైన నాత్మబంధువులైన 79
సుతులుహితులెవ్వైన తీతలమున
ధనముకొఱకు దయ విదారించి హింసలు
సలుప శంకరిలను తులువజనులు.

గీ॥ ఆశగలవారు ధనవంతులైన గాని 80
భువిదరిద్రులె యాగావె పోల్చిచూడ
బంధుమిత్రులు మఱియెల్ల భాగ్యములును
దప్పక నశించునవెయంచు దలపుమెపుడు.

ఆ॥ తానొనర్చినట్టి తప్పుల నొరులకు 81
జెప్పిమదిని వగపు జెందిమరల

నట్టిదోసమెన్న డాచరింపక యున్న
భావశాంతిగలుగు భయములేదు. 82

ఆ॥ మనసునిల్పలేని మనుజుండు మోక్షంబు
నొందబోడుగాన, ముందుగాను
మనసునిలుపనేర్చి మరిమోక్షమందంగ
యత్నపడెడువాడె యధికుడండ్రు. 83

గీ॥ అఖిలజనులను మెప్పించినట్టి ఘనుడు
పుడమిలోనేటివరకును బుట్టలేదు
ఎల్లరికిసంతసము గూర్పనెంచువాడు
తనకు నొకరికేనిసుఖంబు గూర్పలేడు. 84

గీ॥ ఇడుములెన్నిని విడువక గుడుచుచున్న
నోర్చిధైర్యంబు మదిదాల్చి యుండవలయు

గష్టములుగల్గు టిలనీతి గరవుకొంరకె
యీశుడేమిచ్చు నవియెల్ల హితముకొఱకె. 85
గీ॥ అవని నధికపరిసంగమే హానిదెచ్చు
నూరకుండుటయే చూడ నుత్తమంబు
మౌనమును దాల్చి యీశు నెమ్మదినినిల్పి
ధ్యానమొనరించుమది ముక్తిదాయకంబు. 86
గీ॥ అవని దమకన్న హీనమానవులఁజూచి
తనకు గలిగినంతకుదృష్టి గానగవలయు
నారుల శ్రేయంబు మదినోర్చి యుండవలయు
సహనమే యెల్లభంగుల జయముగూర్చు. 87
గీ॥ అరయ నినుమించువారు లే రవనిలోన
నిందుఁడవునీవు చందురుఁడ వీవటంచు

భువినిగొందఱు నిన్నెంత బొగడుచున్న
నంత గర్వింప కవి ముఖస్తుతులెగాన. 88

గీ॥ ఎవ్వడు పరులదోషంబుల నెంచువారు
తమకుగల లోపముల కైన దలపబోరు
విమలవిజ్ఞాన వేత్తలౌ విబుధులరసి
ఖలులయందేని సుగుణముల్ గనుచునుందురు. 89

గీ॥ హృదయమందలి భావంబు వదనమందు
నద్దమునబోలె గోచర మగుచునుండు
గాన మదిలోన దుష్ట సంకల్పములను
మానినిర్మల జ్ఞానంబు బూనవలయు. 90

గీ॥ పక్షములజాచి సర్వంగ జాలునట్టి
రెద్దిలేదంచు మూఢు లూహించుచుందురు

జడులఁజూచియు ఘనులు సజ్జనులుమూర్తి
మెన్నిరో నీతులను గ్రహియించుచుండ్రి. 91

గీ॥ చెడుగుణంబుల విడక శివుని వేడు
వంతనే యెరు మోక్షంబు నందలేరు
పథ్య మౌషధమును మాని వైద్యుఁగొల్చు
మనుజులకు నెందు రోగంబు మానగలదె? 92

ఆ॥వె॥ చెప్పుమాటకంటె చేయు పనియె మేలు
నడువునట్టి నీతి నడువ మేలు
పరమపదము నొంద భక్తిమార్గము మేలు
భక్తిహీనుకంటె పశువు మేలు. 93

గీ॥ పుట్టుటయు పెరుగుటయును భూమిలోన
మరణమును రోగమును దుఃఖకరములగును

బాల్య యౌవనములు వార్ధక్యములగును
నిలువదిలలోన దేహంబు నీటిబుగ్గ. 94
గీ॥ మధురమగునట్టి కడవెడు మంచినీట
దలప నొక బొట్టు విషము గలసినను
త్రావుటకు నెవ్వరుమాత్రంబు దగనియట్లు
పరము గోరిన విషయముల్ బాధకములు. 95
గీ॥ అస్థిరంబైన జగము నిత్యంబటంచు
నమ్మి మోహమునొందింత జ్ఞానంబులేక
అకట! చిత్రమా! నిన్నెమనంచు భువిని
మాయయే నిన్ను మోసంబు సేయుచుండె. 96
ఆ॥ వె॥ ఒరులు నీకు నెట్టులొనరింపగోరెదో
యట్లు పరులకీవు నాచరింపు

మఱియు లేదు సేయ నిష్టంబుగావో సీ
పట్టి పనుల జేయ కన్యులకును. 97
గీ॥ అంటియుంటక సకల కార్యములయందు
బురదయందుండు తమ్మరపుర్వువోలె
మెలకువను సర్వకాలంబు మెలగవలయు
ముక్తిగోరెడి భక్తులాసక్తితోడ. 98
గీ॥ బోధచేయువారు బుద్ధిమంతులెగాని
యట్లొనర్చువార లరుదుగాదె
చెప్పువారలెల్ల చేయువారలైన
లోపమేమిగలదు లోకమునను. 99
గీ॥ ఎన్నిబోధలైన నితరుల కెఱిగింప
నలవియగునుగాని యట్లునడువ

గీ॥ తప్పులున్నవటంచును దలపకయ్య
దేవ నీదివ్యపాదార విందములకె
భక్తి నీచిన్నిపాత్ర మర్పణమొనర్తు
గైకొనుము తండ్రి మది ననుగ్రహముతోడ. 1

సీ॥ నాయిష్టదైవమా నీయందుమద్భక్తిచే
బొత్తంబు వ్రాయగా బూనుకొంటి
పద్యలక్షణములఁ బారజూడగలేదు
శాస్త్రంబులైనను చదువలేదు
నీయనుగ్రహముచే నిర్వహించితిగాని
భక్తవర్యులనే వకక్షురాల
జగతి నీస్మరణచే సాధింపగారాని
ఘనకార్యమేదైన గలదె తలప

గీ॥ నీవు ప్రియభక్తులనుబ్రోవ నిశ్చయించి
దాసపోషుఁడనబిరుదు తథ్యముగను
జేయ సంకల్పసిద్ధుల జేయలేవు
నీదు కృపగల్గఁగాదవేమి నీలకంఠ. 2

సీ॥ ఓ భక్తమందార! సౌపుణ్యసంచార!
మోహనాకార! కేల్మోడ్పునీకు
పాపసంహారకా! భవవార్ధితారకా!
నాగభూషణ! వందనంబునీకు
బలితపావనశీల! శ్రితజనపరిపాల!
కరుణాలవాల! మంగళమునీకు
మోక్షప్రదాతమా! దాక్షిణ్యసంపూర్ణ!
ఉమరేశవినుత! జోహారునీకు

గీ॥ విమలచారిత్ర! యివె ప్రణామములునీకు
అతుల కారుణ్యసాంద్ర! సంస్తుతులునీకు
శమనిధాన! సాష్టాంగ దండములునీకు
శ్రీమహాదేవ! భవ! నమస్కృతులునీకు.

సీ॥ భక్తులకన్నుల పండువుగాఁగను
బ్రత్యక్షదైవమై పరగెనెవడు
శ్రీకరుండై మాయ లోకాద్యతీతుడై
కరుణాలవాలుడై గ్రాలునెవడు
నిర్గుణబ్రహ్మమై నిర్మలమూర్తియై
యాద్యంతశూన్యుడై యలరునెవడు
సజ్జనపూజ్యుడై సన్మాన్యచరితుడై
నిర్మానమోహుడై నెగడునెవడు

గీ॥ నిత్యకరుణాస్వభావుఁడై నిలుచు వెవఁడు
శాశ్వతానందరూపుఁడై జగములెల్ల
నేలునే దేవుఁడట్టిమహేశ్వరుండె
మాయభీష్టములిడి ప్రేమమనుచుగాత. 4

సీ॥ మాపాలిదైవమా! మాపైనగోపమా
మమ్మేలభారమా మాన్యచరిత
ముక్తిప్రదాయకా భువనైకరక్షకా
పాపవిధ్వంసకా! భక్తపాల
శిష్టజనావనా దుష్టసంహరణా
నిర్మలా నిర్గుణా నిశ్చలాత్మ
కరుణాలవాలనే కడగండ్ల బడజాల
బ్రోవఁగా జాగేల పుణ్యశీల

గీ॥ భవ్యచారిత్రి నుతిపాత్రి పద్మనేత్రి
దేవ! కరుణాస్వభావ సర్వ భావివరావ
పరమ కల్యాణగుణధన్య గురువరేణ్య
సర్వలోకేశ పరమేశ పార్వతీశ.

సీ॥ అఖిలవిద్యలకును నాలయంబుగ నుండి
వేదరాశికిని బునాదిగాఁగ
సకల బుధశ్రేణి సన్నుతులనుగాంచి
వాసికెక్కిన మహావాణిగాఁగ
కళ్యాణియై సర్వకారణ భూతయై
బ్రహ్మలోకమునకు రాణిగాఁగ
నెల్లలోకములకు నేలికయై యొప్పు
నబ్జసంభవున కర్ధాంగిగాఁగ

గీ॥ సకల కార్యములకు సరస్వతిని ముందు
శుభము లొసగెడి తల్లియంచును నుతింప
సృష్టికర్తకు దేవివైయొప్పు భాగాంచి
నట్టిశారద కర్పింతు నధికభక్తి
బంధనలు లేనిముక్తికై వందనములు. 6

సీ॥ దేదీప్యమైనసీ దివ్య తేజంబును
గాంచి యానందించు కనులె కనులు
నిష్ఠతోనింద్రియ నిగ్రహంబును జేసి
మనసార నినువేడు దినమె దినము
సతతంబునీనామ స్మరణామృతము గ్రోలి
తన్మయత్వము నొందు జన్మజన్మ

నీప్రీతికరముగా నిఖిల కర్మలఁజేసి
తనువునీకర్పించు తపమె తపము
గీ॥ మంచిచెడ్డల గుర్తించు మనమెమనము
పుణ్యపాపంబు లెఱిగెడి బుద్ధిబుద్ధి
దానధర్మంబులకు నిడు ధనమెధనము
ధరణి సన్మార్గచరుఁడగు నరుడెనరుఁడు. 7

సీ॥ బ్రహ్మాండములకెల్ల బ్రభువునీవై యుండి
కరుణనేలుచునుండ కొ[illegible]లేల
జనకుండవై నీవు తనయుల రక్షింప
బరుల పంచలఁజేరి బ్రతుకనేల
జీవితంబిలను నస్థిర మౌచునుండంగ
దేహగేహములపై మోహమేల

యాశలేమి మెధాత్రి నానంద మిడుచుండ
పట్టిభ్రాంతుల నరుల్ బడగనేల
గీ॥ మాయలోకంబు దీనిపై మమతయేల
నిఖిలమును జూడఁజూడఁగా నీదులీల
యితరమున్నదె వేఱుగా నెంచనేల
సత్యవతినేల యీలీల జాలమేల. ౪
సీ॥ నీయాజ్ఞదప్పక నీయందుభక్తిచే
నినునమ్మి గొలుచుటే నిత్యసుఖము
మాయలోకము నిత్యమా? యంచువిడనాడి
భక్తి నిన్దలుచుటే పరమసుఖము
తల్లిదండ్రులటంచు నిల్లు వాకిలియంచు
ప్రేమానుబంధంబు విడుటె సుఖము

మానవారు మనమను మమకారముల జిక్కి
శ్రమలొందకుండుటే యమిత సుఖము
గీ॥ కల్లవిషయంబులందునఁ గలదె? సుఖము
దీనివిడనాడి పోవుటే దివ్యసుఖము
భోగముల బాయుటయె పరిపూర్ణ సుఖము
సత్యపతికిచ్చెదవు నీవు సర్వసుఖము. ౭

సీ॥ దేవ! నీపదసేవ గావింతుమన్న నీ
చరణపంకజములు దొరకవయ్యె
పాపులమాటచేఁ బరమాత్మ నీదివ్య
దర్శనంబైనను దక్కదయ్యె
బిడ్డలయందలి ప్రీతిచే నీపైన
గరుణింతువన మది గరఁగదయ్యె

గామాదులఁ దుంచి కదలకుండెదమన్న
చలనమా హృదయంబు నిలువదయ్యొ
గీ॥ జిత్తమే యింద్రియములచేఁ జిక్కెనయ్యా
మానమును దాల్చి రక్షింపమానకయ్యా
కాలయాపన జేయుట మేలటయ్యా
బాల సత్యవతిని నెడబాయకయ్యా.
సీ॥ అవివేకినై యుంటి నజ్ఞానమున నేను
నిర్మలసుజ్ఞాన నిధివినీవు
భవబంధములజిక్కి బాధలందితిని నే
నిడుముల బాప వైద్యుడవునీవు
పెక్కుజన్మములెత్తి వేసారితినినేను
జన్మరాహిత్య నిశ్చలుఁడవీవు

ఎందునగతిలేని మందభాగ్యుఁడనేను
దిక్కుమాలినవాఁడ దిక్కునీవు
గీ॥ దాసులనుఁ బ్రోవఁ బ్రతినను దాల్చినాఁడ
విఠ్ఠలుఁడవు నిన్నాశ్రయించియుం॥ 11
కల్పవృక్షంబువలెనీవు గలిగియుండి
కోరికదీర్పవదేల సద్గుణసుశీల.
సీ॥ చిఱుతప్రాయమునుండి నెఱనమ్మితినినిన్ను
చిరకాలమెడబాయ జెల్లునయ్య
తల్లిదండ్రియు గురు దైవంబుదాఁగయు
నెల్లదిక్కువంచు నెఱుఁగనయ్య
ఖలులంచుమముబాయ దలతువే యెట్లైన
తనయులరక్షింప దప్పదయ్య

నేరకగావింపు నేరంబులేగావ
యించుకైనను గోప ముంచకయ్య
గీ॥ కష్టములమాన్ప నీకింత కఠినమయ్య
కరుణలేదయ్య నీమది కరుగదయ్య
యెంతవారలు నిన్నెంచ నేరరయ్య
నీదుమహిమల వర్ణింప నేర్తుమయ్య. 12
సీ॥ తల్లిదండ్రులవోలె నెల్లభంగులనుమా
క్షేమంబులరసి రక్షించినావు
చెలికానివలెను మాశ్రేయంబుగోరి స
ద్బుద్ధినిఁ గఱపంగ బూనినావు
ప్రభుకీర్తిమము దుష్పథముల నడువంగ
హితమాచరింప దండించినావు

కడగండ్లఁబడువేళ కారుణ్యమూర్తివై
దరిఁజేర్చి ప్రీతిమనోదార్చినావు
గీ॥ అన్నివిధముల నీమేలు నందుచుండి
భక్తిహృదయంబు నీకు నర్పణముఁజేయ
నట్టి యసమర్థులముగాదె? యనఘచరిత
మముకృతఘ్నులమని యాత్మ! మఱువకయ్య. 13

సీ॥ కర్ణముల్ నీదివ్య కథలను వినుచుండ
జిహ్వానీస్మరణంబుఁ జేయుచుండ
నేత్రముల్ నిత్యంబు నిన్నుఁజూచుచునుండ
బుద్ధినీమహిమల బొగడుచుండ
సర్వేంద్రియములు నిశ్చల విరాగమునొంది
కడతేరుటకు పాటుఁబడుచునుండ

మాయలోకముజోలి మనకేల వనిపిడి
యత్యంతభక్తి నీయందునుండ
గీ॥ కష్టములు గల్గెనంచు దుఃఖంబులేక
సౌఖ్యమొందెదననెడి వాంఛయునులేక
కలిమిలేముల నొక్కరీతి గాంచుచుండ
నట్టిభక్తుఁడె నిను బొంద నర్హుఁడగును. 14

సీ॥ పతితపావనుడన్న పలుకుసత్యంబైన
జాపులంచును మమ్ము బాయనేల
సదయుఁడవనుటయే సార్థకంబై యున్న
గఠినత మాపైని గలుగనేల
నిఖిలంబునీవిశ్వమై నిండియుండియునీవు
దర్శనంబీయక దాగనేల

యాత్రికుఁడవై వనుటవిక్కాంచైన
బిడ్డల నిక్కట్లఁ బెట్టనేల
గీ॥ నీదుమాయలఁ దెలియంగ నేర్తుమయ్య
యజ్ఞులముగాన నిన్నిట్టు లంటిమయ్య
తనయులముగాము యువ్యథాతలపకయ్య
కోపముంచక నీప్రాపు గోరితయ్య.
సీ॥ చాలుఁజాలునటండ్రి సంసారభోగముల్
వందనంబిక నాథ వలదువలదు
ఇహలోకబాధల నింక నేభరియింప
జాలనయ్యా నీదు సరసఁజేర్చు
పతితులమనిబాయ గతివేఱుగలదె నీ
సుతులిట్లు వెతలొందఁ హితమెనీకు

సకలలోకములకు స్వామివైయుండియు
దండ్రి మమ్మేటుకేయ దలచినావె
గీ॥ బిడ్డలందైన నొక్కంటి ప్రియరావె
దాసులనుబ్రోతువనుట సత్యంబుగాదె
దేవ! నీభక్తులను మున్ను బ్రోవలేదె
ఎల్లరను నొక్కరీతిగా నెంచవలదె. 16

సీ॥ సంసారమే దుఃఖజలనిధియైదోప
గడియలే యుగములై గడచుగావె
మతికి నంతోష మేమాత్రంబు లేకున్న
బ్రతుకు భువిని దుర్భరముగాదె
బందిఖానను బోలి స్వగృహంబెయుండంగ
తనువునిల్చుట కష్టతరముగాదె

యిహసౌఖ్యమనునది యినుమంతరేకన్న
నీలోకమందుంట వృథమొకాదె
గీ॥ దేవ నీకింతమాత్రింబు దెలియకున్న
మరలనానోట బల్కింప మదిదలంతె
మెఱిగియుండిన నిటు లుపేక్షింతువా నా
మొఱిగిమొఱగని విధమది యేటికయ్య. 17

సీ॥ అనిలాగ్ని పృథ్వీ జలాంబరంబులలోన
వ్యాపించినడిపించు వాడవీవ
ఆదిత్య చంద్రతారాగ్ని నక్షత్ర తే
జోరూపుడా జగజ్జ్యోతివీవ
యక్షరాక్షసమానవాదితిర్యగ్జంతు
సకలభూతాంతరాత్మకుడవీవ

త్రిగుణాత్మకుడవై చేతనాచేతనాం
తర్వ్యాపకుడవై జగత్సాక్షివీవె
గీ॥ తొలుత నీ రేడుజగముల సృష్టిజేసి
అంటియుంటని పరమాత్మ వనగనీవె
దేవయాద్యంత శూన్యమై దివ్యమైన
నీమహాశక్తి నింత వర్ణింపగలమె. 18
సీ॥ ప్రోవ నెంచిననీవె ప్రోవకున్ననునీవె
పరమునిచ్చిననీవె పాపివినీవె
దరిజేర్చిననునీవె ధైర్యమిచ్చిననీవె
దయజూచిననునీవె తండ్రివీవె
త్రోవజూపిననీవె త్రోసివేసిననీవె
సౌఖ్యమిచ్చిననీవె సఖుడవీవె

సత్యంబు శాంత్యాది సద్గుణంబులనిచ్చి
శాశ్వతమోక్షం బొసంగనీవె
గీ॥ సత్యవతి రమ్మటంచును సాదరమున
పరమునందున నను జేర్చ పనియునీవె
యన్నిటికి నీవెయనుచు నాయాత్మలోన
నమ్మియున్నాను దిక్కింక నాకునీవె. ౧౪
సీ॥ గతినీవెయనినాడు మతినమ్మితినిగాదె
కష్టంబులిటునాకు గలుగు టెట్లు?
శరణన్నవారి రక్షణసేయుదువుగాదె
నాతండ్రివను విడనాడు టెట్లు?
విషయంబులనుబాసి వెఱచుచుంటినిగాదె
మోహాబ్ధియందు నేమునుఁగు టెట్లు?

సర్వేంద్రియంబులు స్వాధీనమైయుండ
బంధనంబులఁ జిక్కువడుటఁ కెట్లు?
గీ॥ చెడుగుణంబుల నన్నింటి జెడియుండ
దండిదొరవౌచు నీవు నాయందనుండ
నీకటాక్షంబు నాయందు నిండియుండ
నాకు భయమేలనో కరుణాలవాల. 20

సీ॥ బడబానలమునందు బడి తపించెడువాడు
దరిఁ జేరఁగానెట్లు తల్లడిల్లు
నాకీవిహాలోక ఘోరమాయలఁ జిక్కి
ముక్తిమార్గ మెఱుఁగు శక్తిలేక
విశ్వేశ! నీకీర్తివిని విన్నకోరితి
ననుగావగానెంచి నావాలేదా?

కర్మంబు దొలఁగింపఁగా నొల్లనని మమ్ము
వెరపింతువో కరుణలేక
గీ॥ మొన్నటిదైన నిన్నల నున్నవాఁడ
ననుచు నభయంబు నీయవే యనఘచరిత
భారమంతయు నీదెగా భక్తవరుల
నేలఁజాగేల యీలీల నెంచనేల? 21

సీ॥ భవదీయ నామప్రభావంబుచే గాదె
ప్రహ్లాదుఁడు భయంబుఁ బాయఁగల్గె
మహనీయమైన నీమహిమ చేతనె కాదె
నిఖిలలోకము లిట్లు నిలువఁగల్గె
ఘనమైన నీకటాక్షంబుచేతనె గాదె
గాంగేయుఁ డిలకీర్తిఁ గాంచఁగల్గె

నీనామసన్మంత్రి నిష్టచేత నగాదె
ధృవకుమారుండు వర్ధిల్లగల్గె
గీ॥ తండ్రి! నీదివ్య నామామృతంబుచేత
నచలనిర్మల నిర్గుణంబైనపదవి
నైన సాధింప నగుగాని యజ్ఞులకును
నీమహాత్వంబు నెఱిఁగి వర్ణింపదరమె. 22
సీ॥ నీసృష్టిమహిమల నీవింతచర్యల
నీలీలలను గన్న నిశ్చయముగ
నద్భుతంబుగనుండి యానందమును గూర్చు
చిత్రంబు నీదుచారిత్రమెల్ల
నడుగుదాటక విశ్వమంతయు నీయాజ్ఞ
మెలఁగుచుండును గాదె మిగులభక్తి

పదునాల్గు జగములు పాలించుచుందువు
కారుణ్యమునఁబూని కష్టమనక
తృణమైన నీకటాక్షము లేక పుడమిని
బ్రతుకంగశక్యమే ప్రాణులకును
బుట్టింపపోషింప గిట్టింపనీవయై
మూడుమూర్తులకాది మూర్తివగుచు
సండపిండాండ బ్రహ్మాండంబులను చరా
చరములకును నీవకర్తవగుచు
సకలాత్మకుడవయ్యు సుఖదుఃఖముల నొందఁ
బొందక వెలయు నానందరూప
గీ॥ హరిహరాదులె నీమాయ లెఱుఁగ రనఁగ
నిర్గుణాకార సాకార నిన్ను దెలియ

దగమ నాఁగొటియబలకు ధాత్రిలోన
గైకొనుమదేవ! నానమస్కారములను. ౨౩

సీ॥ మున్నుమార్కండేయ మునివిని లింగమం
దుదయించి మోక్షంబు నొసఁగినావు
శరణన్న మాత్రాన సురల కోర్కెలఁ దీర్ప
గాలకూటము మ్రింగఁ జాలినావు
నినువేడినంతనే మనమునఁ గరుణించి
యీశ్వరీకర్ధాంగ మిచ్చినావు
దిక్కునీవనివేఁడు దీనులరక్షించి
భక్తవత్సలుఁడనఁ బరఁగినావు
గీ॥ క్షితిని నీదివ్యచరిత మద్భుతముగాదె
యెల్లజగముల కాధార మీవెగావె

కరుణ గలవాఁడవనుచు నిక్కంబుగాను
బాల సత్యవతినిగావ భారము నీ? 24

సీ॥ కాషాయవస్త్రముల్ గట్టికప్పినవేల
రమణీయపీతాంబరముల మాని
భూతిని మైనిండఁ బూసినావది యేల
యల సుంగధద్రవ్యములను మాని
సతతంబు కాటిలో సంచరింతువ దేల
రత్నభూషిత మందిరముల మాని
పులిచర్మములనీవు పాఱలుచుందువ దేల
హంసతూలికతల్పమందు మాని
వృషభవాహనమంచు నెక్కసాగితివేల
ముద్దుఁగొల్పెడు రథములను మాని,

గీ॥ సకలలోకములకు నీవె స్వామివయ్య
నస్థిరంబంచు సుఖములం దాశ లేదు
హీనజన్మంబు లెత్తిన మానవులును
విడువఁగానొల్ల రస్థిరవిభవములను. 25

సీ॥ అయ్య! నిన్ను నుగాంచి యానంద మొందిన
మనుజులు పెక్కండ్రు మహిని లేర
స్వామి! నిన్ను ను వేడి శాశ్వతసౌఖ్యంబు
లనుభవించినవార లవని లేర
తండ్రి! నిన్ స్మరియించి ధన్యులై నిశ్చలా
నంద మొందిన పుణ్యనరులు లేర
జనక! నీపాదాంబుజంబుల నెరనమ్మి
కైవల్య మొందిన ఘనులు లేర

సీ॥ పాపకర్మములు దుర్మార్గప్రవృత్తులును
నిన్ను స్మరియించినంతనే నీలకంఠ
ముక్తిఁ బొందెదరనుచు లోకోక్తి వింటి
తండ్రి! నన్నేల భారమా ధాత్రినీకు? 26

సీ॥ చిన్మయాకార! నాజిహ్వ కింపుగ నీదు
నామంబుగొల్చి నే నడచు టెపుడొ?
భక్తితోడను నీదు పదసేవ చేయుచు
సంతసంబుగనుందు సమయ మెపుడొ?
మరణమే విజయించు మదినమ్మి నేనింక
నిర్భయంబును గల్గి నిల్చు టెపుడొ?
నీదునామమె నాకు నిజమైన ధనమంచు
నెంచి వాంఛలను వర్జించు టెపుడొ?

ఐహికవిషయమాయలఁజిక్కి చెడకుండ
పరమపదవిఁజేరు భాగ్యమెపుడొ?

గీ॥ తలఁపు నీదివ్యమూర్తిపై నిలుచు టెపుడొ?
చేతులాఁకంగ నీసేవ చేయు టెపుడొ?
కనుల నీరూపు నిండుగాఁ గాంచు టెపుడొ?
పుట్టుచావులు లేక నిన్నొందు టెపుడొ? 27

సీ॥ త్రిభువనంబులకును ప్రభువయ్యు వల్లకా
డిల్లుగా వసియింప నోఁచువాఁడ
నిజభక్తులనుబ్రోవ రజతాద్రిపైఁబ్రీతి
కాపురంబున్న ముక్కంటివాఁడ
రమణీయపీతాంబరంబుల నొల్లక
మృగచర్మధారివై మురియువాఁడ

నవరత్నమయభూషణంబులవీడి రు
ద్రాక్షహారములనుదాల్చువాఁడ
శిరమునగంగను ధరియించియునుగూడ
నభిషేకముల బ్రీతినందువాఁడ
నిఖిలంబునీవయై నిండివెల్గుచునుండి
యజ్ఞానులకు నందనట్టివాఁడ
గీ॥ అఖిలజగముల కాధారమైనవాఁడ
భక్తులనుబ్రోచు దీక్షచేఁ బరగువాఁడ
నీవెగతియంచు నిరతంబు నిన్ను వేఁడ
న్యాయమే? నీకు నాతండ్రి నన్నువీడ. 28
సీ॥ ఈశ్వరా! నీయందు విశ్వాసమునునిమ్ము
మానక నీపద ధ్యానమిమ్ము

సత్యంబుదప్పక సంచరింపఁగనిమ్ము
విషయాదివాంఛల వీడనిమ్ము
నిరతఁబునీదివ్య స్మరణ జేయఁగనిమ్ము
దేహమస్థిరమని తెలియనిమ్ము
జగము మిథ్యయటంచెఱిఁగి బాయఁగానిమ్ము
కనులార నీరూపుగాంచనిమ్ము
గీ॥ బుద్ధియంతయు నీయందె పొందనిమ్ము
చెడుగుణంబుల శీఘ్రమె చెండనిమ్ము
మంచిమార్గంబునను నన్ను మనగనిమ్ము
బాలసత్యవతికి మోక్షపదవినిమ్ము. 29
సీ॥ దానధర్మాది సత్కార్యముల్ జేయంగ
మానితంబైన సుజ్ఞానమీవె

వెతలెన్ని గల్గినన్ విడక నీయాజ్ఞల
దలదాల్చి నెఱవేర్చు ధైర్యమీవె
బీదసాదల ప్రేమ నాదరించెడు లోక
పూజ్యమౌ కారుణ్య బుద్ధినీవె
నిత్యంబు నీపాద నీరేజముల సేవ
శ్రద్ధమైగావించు శక్తినీవె
గీ॥ పావనంబైన పరిపూర్ణభక్తినీవె
రాగభోగములందు విరక్తినీవె
సత్పథంబుల నడువ నాసక్తినీవె
మోక్షదాయక! యికనైన ముక్తినీవె. 30
॥ నీ దివ్యచరణముల్ శరణమ్ముగానిమ్ము
గాఢవైరాగ్యంబు గలుగనిమ్ము

నిజమైనభక్తిని నీయందు నాకిమ్ము
నిత్యంబునీచెంత నిలువనిమ్ము
ప్రీతిపూర్ణంబున నిన్ను బ్రస్తుతింపగనిమ్ము
జరయు మృతియులేని స్థలమునిమ్ము
ప్రాపించి కార్తులఁ బడకుండగావుము
నీ నామమునుతించు నేర్పునిమ్ము
గీ॥ చిత్తమంతయు నీయందు జేరనిమ్ము
సత్యమార్గంబున నెమొందు జనఁగనిమ్ము
హేయసౌఖ్యంబులందాశ బాయనిమ్ము
పరమపావనమగు నీదుప్రీతినిమ్ము. 31
సీ॥ జననమరణ బాధ లనుభవింపగజాల
నికనైన జన్మరాహిత్యమీవె

తండ్రినిన్నడబాయఁ దనయులు సైతురే
దండిగా నీయండ నుండనీవ
పుడమిమాయలఁజిక్కి పడరానియిడుముల
బడుచుంటి నీకు నిత్యపదవినీవ
యేదిక్కుగావక యేమార్గ మెఱుఁగక
యీరీతినున్న నన్నేలరావ
గీ॥ జనక! యెంతగ మనవినేజాలఁజేయ
గష్టములెయెందు బోయినఁ గలుగుచుండు
నీసుతులనేలు భారంబునీదెకాదె
నీవెఱుంగనిదున్నదే నీరజాక్ష. 82
సీ॥ ఆయురారోగ్య సద్భాగ్యంబులనిచ్చి
దేవ! మమ్మాశీర్వదింపుమయ్యా

యిహపరంబులలోన నేకోర్కె యింతయు లేక
చిరసౌఖ్యముల గటాక్షింపుమయ్యా
శాంతిశమదమాది సద్గుణంబులొసంగి
నీవు నామదిలోన నిలుపుమయ్యా
కల్పవృక్షమువోలె గలకోర్కెలిడజాలు
నీప్రేమ మాపైని నింపుమయ్యా
గీ॥ జన్మరాహిత్యపదవి నొసంగుమయ్యా
యెడతెగనిభక్తి నీయెడ నిడగదయ్యా
శీఘ్రమే మోక్షమిచ్చి రక్షింపుమయ్యా
వెతల నెడబాపి మమ్ము దీవింపుమయ్యా. 33
సీ॥ పుడమిలోపల నేను బుట్టినప్పటినుండి
నీసేవగావించు నేర్పుమీఱగ

ధరణిమాయలఁజిక్కి పరమునుగోల్పోతి
పాపహారణ నీదు ప్రాపుఁజేర్చు
భక్తవత్సలనీదు పాదంబులేదిక్కు
నన్ను బ్రోయుట నీకు న్యాయమగును
నిన్ను నెప్పుడునేను సన్నుతించెదమన్న
నవని కాంతులునన్ను నణఁగఁద్రొక్కె
గీ॥ మోక్షదాయక! నీకు నేమ్రొక్కెదాన
నీదు సేవకురాలను నిజముగాను
కోఁవచ్చితి నాతండ్రి కోపముల
కాంతులన్నిటిబాపవే కష్టమనక.
సీ॥ జననిరో! నీవైన జనకునితోఁజెప్పి 34
తనయుల మమ్ము చేకొనఁగదమ్మ

మాత! నీవిక నైన మాకొండి కెఱిగించి
యద్వితీయానంద మందనిమ్మ
నామొరాలింపుమా! యీమాయసంసార
సాగరంబీదంగ జాలనమ్మ
తల్లిరో! నీవైన దయయుంచినాయందు
దుఃఖవార్ధినిఁ బడదోయకమ్మ
గీ॥ అమ్మ! నినునమ్మినానమ్మ నెమ్మనమున
మాత! నినువేడినానమ్మ మానసమున
తల్లి! నినుగొల్చినానమ్మఁ యుల్లమందు
జనని! నీకన్నదిక్కెవ్వ రీ జగతిగలరె? 35
సీ॥ ముల్లోకములనెల్ల నుల్లంబురంజిల్ల
చల్లగానేలెడి, తల్లివీవె

తనయులదీనతం గని మది గరుణించి
ఘనసౌఖ్యముల నిచ్చు జననివీవె
పాపులమని మమ్ము బాయక ప్రీతిచే
మాతృప్రేమన్నించు మాతవీవె
పుట్టించి రక్షించి పోషించి నిఖిలంబు
నీవెయైవెలిగెడి దేవివీవె
ఆ॥ వె॥ ఎల్లభోగములను నొల్లక సర్వంబు
కల్లయనుచువీడి తల్లినీదు
చల్లనైనపాద పల్లవంబులభక్తి
నల్లమందుగొల్చు టుత్తమంబు. 36
సీ॥ కనులార నినుజూడ కాంక్షించితిని మది
నీదర్శనంబీవు రాదటమ్మ

జగముల కెల్లను జనని నీవేగావె
మాతనీసుతులాట మరువకమ్మ
భవబంధముల బాప శివునర్ధాంగివై
యవతరించిన తల్లి వాదువమ్మ
ఆదరింతువటంచు అమ్మరో! సకలంబు
విన్నవించితినీకు వినుగకమ్మ
గీ॥ నగులు కడుశ్రమలందు టీవెరుగవమ్మ
యిట్లుమానంబుదాల్ప నీకేటికమ్మ
మొల్లకాలంబు నిట్లుండ జెల్లునమ్మ
నీవెయిట్లున్న జగమెట్లు నిలుచునమ్మ. 37
సీ॥ పుడమిలోపల నేను బుట్టినప్పటినుండి
పశరానియిడుములఁ బడితినమ్మ

గతిఁ జెందని నాదు మతిలోన నమ్మియు
మితిలేని వెతలనొందిరి గదమ్మ
పతితపావని నీదు సుతులిట్లు వెతలొంద
గతిని జూపకయుంట హితవటమ్మ
ఎల్లలోకములకు నేలికవైయుండి
తల్లి! మమ్మిటు సేయఁ దగునటమ్మ
గీ॥ పలుకవేమమ్మ మాపైన నలుకటమ్మ
యిమ్మహిని నాదు వెతలింక జిమ్మువమ్మ
యించుకైనను పరులమం చెంచకమ్మ
తల్లి! నీముద్దుసుతను సత్యవతినమ్మ. 38
సీ॥ శ్రీకరంబైనట్టి లోకేశునామంబు
దరిలేని ధాత్రిలో దాఁచినాలు

శ్రీకరంబైనట్టి శ్రీదేవునామంబు
భవరోగమును బాపి వరమునిచ్చు
శ్రీకరంబైనట్టి శ్రీరామనామంబు
వరభక్తులకుఁ గల్పతరువుబోలు
శ్రీకరంబైనట్టి శ్రీకంఠునామంబు
ఘోరపాపములెల్ల గొట్టివైచు
గీ॥ నట్టి సర్వేశునామంబు నమితభక్తి
నమ్మి భజియించువారికి నరకమున్న
యేమిచెప్పెదు నీదివ్య నామమహిమ
కోరి తాల్చినవారికిఁ గొఱఁతగలదె? 39
సీ॥ హాటకసామ్రాజ్య సమ్మోదంబుఁ గోలునే
యిహలోకవిషయాళి హేయసుఖము

నిర్వికల్పసమాధి నిష్ఠనుబోలునే
ధనదారపుత్రి బాంధవ్యసుఖము
వైరాగ్యసుఖకళ వాసనంబోలునే
రంభాదికాంతల రమ్యసుఖము
నిత్యయోగాభ్యాస నియతిని బోలునే
వ్యర్థదంభాచార బాహ్యసుఖము
గీ॥ నిర్వికల్ప సచ్చిదానంద నిత్యసుఖము
బోలునే? తుచ్ఛసంసార భోగసుఖము
దివ్యతరమైన నిశ్చలాత్మీయసుఖమె
అన్నిసుఖములకన్న హెచ్చైనసుఖము.
సీ॥ అగ్రవాంబా! నన్ను నంటకుమీనీవు
నమ్మగూగదు నీదు నడతనెపుడు

మాత్సర్యమా! జ్ఞానమణి హరింపఁగఁబోకు
పాఱిపొమ్మిఁక నన్నుఁబాసివేగ
కామలోభములార! కన్నులఁబడకుండ
దూరంబుగావన్నుఁ దొలఁగిపొండు
చెడుగుణంబా! నీవు చెంతకు రాకుము
పాతాళమునకీవు పాఱిపొమ్ము
గీ॥ ఘోరవైరిగణములార! దారికడ్డు
గలుగనీకుఁడి మీవల్లగలుగు వెతలు
కాన, నను బాసి వేగమే కదలుఁబొండు
త్రోవఁజూపంగ నీశుఁడే తోడునుండు. 41
సీ॥ అన్యవాంఛలయందు నాశ మాననినీవు
కన్నతండ్రిని నెట్లు గాంచఁగలవు

నిమిషంబు హరుమీఁద నిలువకుండిననీవు
నందివాహను నెట్లు పొందగలవు
క్షితీశుని భజన సేయనినీవ
ఎట్లు సంసారాబ్ధి నీదఁగలవు
యంబులన్వాంఛ విడనేరని నీవు
ఘనమోక్షపథమెట్లు గాంచఁగలవు
గీ॥ హృదయమా! నీదు దుర్గతి నెంచిచూడ
నాలో సంతాపమాయె నాస్వాంతమునకు
నెల్లజగముల నీకన్నైనఁ గల్లయంచు
తెలిసి పొందుము వేవేగ దేవదేవు. 42
సీ॥ తనువుశాశ్వతమంచుఁ దలఁచెదు చిత్తమా
తరలిపోయెడివేళఁ దగిలిరాదు

చుట్టపక్కములెంత దిట్టంబుగానున్న
గట్టిగా నీవెంట బట్టరాదు
కూర్మితోడను నీవు గూర్చినధనమెల్ల
మూటగట్టుకపోవ మునసిరాదు
ప్రాసాదరమ్యహర్మ్యములఁ బాగట్టినగాని
ప్రియకుమార నాత్మ వెన్వెంటరావు
గీ॥ గాన నీచమౌభోగభాగ్యముల వాంఛ
విడి సద్భక్తి నీశుని వేడుమింక
బాధలన్నిటిమాన్పును బరమునిచ్చు
శౌరిభజియింపుమీ నీదుకోర్కెదీర.
43 సీ॥ విషయభోగములె సిరిమె శాశ్వతమను
చిత్తమా! నీకింకసిగ్గులేదె

మాయశరీరాభిమానంబు మానవే
నిత్యమా? యిదివట్టి నీటిబుగ్గ
యివ్వడో యెవ్వడో యెడబాయుటేకాని
కలకాలమిలలోన నిలువఁగలదె
భ్రమలలోఁబడి నీవు భ్రమలొందఁగానేల
యెల్లకాలము సౌఖ్యమియ్యఁగలదె
గీ॥ నీమ పుణ్యపాపంబులే నీకుదిక్కు
భక్తవరదుఁడే దీనులపాలిదిక్కు
జగములకునెల్ల నాతఁడే సతముదిక్కు
అతనిగనకున్నగలదె నీకితరదిక్కు. 44
సీ॥ క్షణకాలసుఖములే శాశ్వతంబనినమ్మి
మోహసాగరమందు మునిఁగిమునిఁగి

ఘనమైనయజ్ఞాన గాఢాంధకారంబు
నను జేరి వెతలొంది వనరి వనరి
యిహలోకమే నిత్యమిదియె మోక్షంబంచు
మాయభోగంబుల మఱఁగి మఱఁగి
సత్యాదిసుగుణ రాహిత్యమై కామంపు
వలలలోపలఁ జిక్కి వగచి వగచి
గీ॥ ఎందరెందరో చచ్చుట యెఱిఁగి యెఱిఁగి
ముందు నీగతిగానక మురిసి మురిసి
తుదకు, దైవమా! నాకేది త్రోవయనుచు
గుందఁగానేల? యిపుడైన గోవిందుఁగనుము. 45
సీ॥ తొమ్మిదిచిల్లుల తోలుతిత్తియెగాని
కాంతిగల్గిన వజ్రఘటముగాదు

నిమిష నిమిషమందు నీచములూరునగాని
క్రిమిగుణవ్యాధులు పుట్టుచుండు
మలమూత్రదుర్గంధ మాంసరక్తముగాని
ఘనదురావాసమైన తనువుగాదు
నీచమౌయిదివట్టి నీటిబుగ్గయెగాని
కాలకాలమిలలోన నిలువఁబోదు
గీ॥ భ్రమలబుట్టించి నమ్మించి పాసిపోవు
నిట్టిదేహంబుపై భ్రాంతి తొలఁగనీక
హృదయమా! నిన్నురక్షింపఁదు తుదకు నీకు
కన్నతండ్రియె గతిగాక గలరె? యొరులు. 46
సీ॥ సన్మార్గవర్తివై సంచరింపకయున్న
చపలున కిల జననమది యేల?

తాపత్రయంబుల దగిలి నిన్మఱచిన
పతితున కుపవాస వ్రతములేల?
పరిపూర్ణవిజ్ఞాన భక్తిలేకున్న వ్య
ర్థముగాక తీర్థయాత్రలవియేల?
మమకారహంకార మాత్సర్యముల
జిక్కి నిన్నుగావనివాని నిష్ఠలేల?
గీ॥ భువి మనశ్శుద్ధి లేనట్టి పూజలేల?
తండ్రి! నీసేవఁ జేయని తనువదేల?
పరమపదవి నార్జింపని బ్రదుకికేల?
స్వామి! నినుఁగానలేని యీజన్మమేల? 47
సీ॥ హృదయమా! నీవు నెమ్మదిబూని యుండుమా!
వెతలఁగ్గెనటంచు వెఱువనేల

సదయుండు నీవిప్రియజనమందు ప్రేమఁ జే
యెల్లకాలము కష్టమేలనిలుచు
నైహికసుఖమె నిత్యంబంచు నమ్మ కే
యొక్క రీతిగ సౌఖ్యముండఁ బోవ
దీజగంబునమున్న నైజమే యిదిగాదె
కొంతదుఃఖంబును గొంతసుఖము
గీ॥ మాయయగు లోకమిది యెల్ల మాయగాదె
కలిమిలేములు రెండును గల్లగావె
కష్టసుఖముల సమముగా గాంచఁగలదె
భక్తికలవారి కెందైన భయముగలదె. 48
సీ॥ చిత్తమా! భయమేల చెందెదవీశుని
కృపగల్గఁగా మనకేమికొఱత

మురవైరి కరుణాసముద్రి డంచెదుగవే
నీదు నేరముల మన్నించుఁగాదె
కలిమిని కులమును ఘనముగా నెంచక
సుగుణవంతులఁ బ్రోవ జూచుగాదె
నిశ్చలభక్తిచే నీకన్నతండ్రిని
నీలోన బంధించి నిలుపలేవె
గీ॥ సర్వలోకైకనాథుండు శాశ్వతుండు
బంధరహితుండు ముక్తుండు పావనుండు
విశ్వమంతయుఁదానయై వెలుఁగుచుండు
వానికన్నను వేఱు దైవంబుగలఁడె॥ 49
సీ॥ బాల్యంబునందు ప్రపంచంబునెఱుఁగక
యజ్ఞానమున నోలలాడుచుండ్రి

కౌమారమందు యుక్తాయుక్తమనుజ్ఞాన
మించుకైనను లేక సంచరింతు
యౌవనంబునను కామాదిషడ్గుణముల
భ్రాంతులచే నెల్ల బడుచునుందు
వార్ధక్యమున దేహ బలమెల్లవీడంగ
బలుకష్టములఁజిక్కి బడలియుందు
గీ॥ బాల్యయౌవనకౌమార వార్ధకముల
శాశ్వతానందమిచ్చు నీస్మరణమౌని
కాలమీరీతిగడువంగ కడకు మోక్ష
పదవినిమ్మంచు నినువేడ ఫలముగలదె. 50
సీ॥ అంతరింద్రియనిగ్రహంబు లేకున్నను
బాహ్యవేషంబుల కాయరకట

కామాది శత్రువర్గము తమ్ము బాధింప
కాలంబుతీయాట గాంచరకట
పరులదోషంబుల బట్టుచుందురుగాని
తమలోపముల నెన్న దలపరకట
యితరులకైన్న్యన నెరిగింపనగుగాని
మన మెట్టివారమో మరతుమకట
గీ॥ అనుభవజ్ఞాన మిసుమంతయైన లేక
కోటిబల్కినఫలమేమి కూటికొరకె
జ్ఞానియౌవాడు భువినెల్ల నంగములను
విడి తామార్గదర్శుడై వెలయువలదె. ౯॥
సీ॥ అల్పసౌఖ్యంబుల కాసించి యిహలోక
బంధనంబులకీవు పట్టువడకు

# భక్తిరసామృతము.

పరిపూర్ణకరుణతో భక్తులరక్షించు
పరమాత్మపదసేవఁ బాయఁబోకు
కోరినకోర్కెలు కొనసాగునని యెంచి
యనృతంబు లెన్నండు నాడఁబోకు
సిరులు హెచ్చునటంచు హరిపాదములవీడి
మంచిత్రోవను బోవ మఱువఁబోకు
గీ॥ హృదయమా! నిన్ను వేఁడెద నింతెయైన
నీదు చలనస్వభావంబు నిశ్చలముగ
చేసి సౌఖ్యంబునొందంగ సిద్ధపడుము
భోగములఁగోరి వెతలొందఁబోకుమింక.

52 సీ॥ హృదయమా! నీమేలు మదిఁగోరి తెల్పెద
నా మాటవినుము నీవోర్పుగల్గి

యిలలోన హాయమా యెనుబదినాల్గు ల
క్షల యోనులందెల్ల జననమంది
మితిలేని వెతలొంది గతి గానఁగాలేక
పుట్టుచుగిట్టుచుఁ దుట్టతుదకు
నన్నింట నుత్కృష్టమౌ నరజన్మ నీ
పుణ్యవశంబునఁ బొందఁగలిగె
గీ॥ పరమపదవిని బొందఁగాఁ దరుణమిదియె
శంకరునిఁ జేరఁ గడసారి జన్మమిదియె
యిట్టి నరజన్మమెత్తియు నింకనైన
తండ్రి హరుగాంచకున్నావు తగునె? నీకు.
సీ॥ మనసారహరుని నామంబుగోలనినీవు
ప్రాపంచకములెట్లు బాయగలవు

సంసారమిది దుఃఖసాగరంబేకావె
వెతలొందియును వేగ విషయజాల
మన్ని రోయనుచుండి యేప్రొద్దుగనుచుండి
మది మోహమిడ్నైన మానఁజాల
వన్ని యెఱింగియు సజ్జ్ఞానివోలె నీ
విహసౌఖ్యముల నపేక్షించినావు
గీ॥ నిఖలసుఖములు స్థిరముగా నిలువఁబోవు
నేను నేనను భ్రమఁ జెందు నీవుగావు
జననమరణరాహిత్య నిశ్చలుఁడవీవు
ఇట్టి నిను నీవె జీవుఁడా! యెఱుఁగలేవు. 54
సీ॥ ఎచ్చటనుంటివో యేరీతిఁబోయితువో
యించుకనీజాడ గాంచనైతి

కన్నారనెన్నాళ్లు కన్నాళ్లకిఁకనీదు
దర్శనంబౌనొకో దలపనైతి
కలవందుకె చోటఁ గనఁగోరువారికి
గాన్పింతువందురనేఁ గానవైతి
పలుబంధములఁజిక్కి వడిమార్గమెఱుఁగక
పిలిచియుండినగాని పలుకవైతి
గీ॥ యెన్నడిఁక నన్ను బ్రోతువో యెఱుగనైతి
నీవు క్షణమైనమదిలోన నిల్వవైతి
నిన్ను హృదయానబంధింప నేరనైతి
దేవ! నీమాయనింతయు దెలియనైతి. ౫౫
సీ॥ మతులులేకున్నను గతులులేవందురు
తాను ధన్యుండైన తనయులేల

శుకమునీంద్రుఁడుమున్ను సుతులనార్జింపక
వ్యర్థుఁడైపోయెనే వసుధలోన
ధరలోన సనకాదియతులయందున
నిధియునొక్కటిగాదె యెంచిజూడ
నిహమున భార్యాపుత్రులకేగాని పరికింప
ముక్తసంగులకేల పుత్రికాంక్ష
గీ॥ భువనతరంబైన నీభక్తిగలిగెనేని
గతివిహీనులకీవె సద్గతివిగాన
ధర నపుత్రులకునికఁ గొఱంతగలదె
గతులులేవన్నఁ బొఱపాటుగాదె? జనక! ౫౬
సీ॥ కానియాడదరమౌని కనికరంబిలలోన
సనుమవజ్ఞుఁడైన ఘనుఁడెఱుంగు

సర్వంబునను నిండి సకలంబుగను చుండు
భవదీయశక్తి నీభక్తుఁ డెఱుఁగు
అఖిలేశ! నీవగు యద్భుతచర్యల
సంగరాహిత్యు జ్ఞాని యెఱుఁగు
పతితులనైన గాపాడు శక్తియుతుండ
వౌనీమహాత్త్యంబు నందరెఱుఁగ
గీ॥ ఇన్నియేటికి దేవ! నేవిన్నవింతు
కష్టములనెల్ల క్షణములో గడవఁ జేసి
కంటికిని రెప్పవోలె నన్ గాచునీదు
ఘనతరంబగు కృపను నామనమెఱుఁగు. 57
సీ॥ పదిలంబుగను నాదు హృదయంబునను నీవు
కదలకుందువు సర్వకాలమందు

ఏమిచేయుచున్న నేదిగాంచిననీదు
యద్భుతంబే తోచు నవనియందు
గృహకృత్యములయందు విహరించుచున్నను
మది నీయనుస్మరణ నేమఱకయుందు
వెతలెన్నియున్నను విడకేసిపోవు నీ
యసమానమౌ కృపారసముగందు
గీ॥ వేగిలేచినదాది నీ విమలమైన
నామమును దోచవెంద మానందమొందు
నెచటనున్నను నీవల్కు లెపుడువిందు
నేల? నన్నేలవింక నిన్నేమియందు. 58

సీ॥ మహిలోననీనామ మంత్రంబుజపియింప
ఋణములో వెతలెల్ల నమసిపోవు

శరణంచు నీపాద సరసిజంబులఁ జేర
ఖలులనైనను బ్రోచి గావఁగలవు
తండ్రి నిన్మనసార ధ్యానించినంతనే
యెడలేని సౌఖ్యంబు లీయఁగలవు
సర్వశక్తుఁడవు నీస్మరణమాత్రంబున
కర్మంబులెల్లను గాల్పగలవు
గీ॥ ఇన్నియననేల ? నీదయ యున్న యెడల
కలుగరానట్టిసంపద గలదె భువిని
ప్రతిఫలంబునుగోరని ప్రభుడవీవె
యిహపరంబులనైన నీవియ్యగలవు. 59
సీ॥ తండ్రికిలేని వాత్సల్యంబునుఁజూపి
ప్రహ్లాదునేలిన ప్రభుడవీవె

తల్లిదండ్రులుకూడ దయవీడి బాసిన
ధ్రువు నేలినట్టి మాధవుఁడవీవ
పత్నులైనఁజూపని భవ్యమౌప్రేమచే
ద్రౌపది నేలిన దైవమీవ
సోదరుండలుక సాధింపనినుఁ జేర
నావిభీషణు నేలినాఁడవీవ
గీ॥ ఎందఱను దెల్ప నేర్తు నేనెఱుఁగనార్త-
యవని కరుణాసముద్రుండ వనఁగనీవ
భక్తులను బ్రోచువను టొక్కపాటిగాదు
శత్రువులనైన రక్షించు స్వామివీవ. ౮౦
సీ॥ ఐదేండ్లపసిపాప యైనయాధ్రువుని న
వ్వైరాగ్యమును మెచ్చి వచ్చినావు

బాల్యంబునుండి నిన్బ్రార్థించుప్రహ్లాదు
భక్తికిమెచ్చి కాపాడినావు
కడుచిన్నవాని మార్కండేయునేకాగ్ర
చిత్తంబుమెచ్చి రక్షించినావు
దీనుఁడై గజరాజు ధ్యానింపనిశ్చల
భావంబుమెచ్చి చేపట్టినావు
గీ॥ తపముయోగంబు నేకాగ్రతయువిరాగ
మాదియౌకష్టములు నాకు నలవియగునె
నిన్నుధ్యానించి స్మరియింతు నేర్చుకొలది
తండ్రి! యెట్లైన మన్నించి దయనుబ్రోవు. ౬౧
సీ॥ నీదాననేగాన నీయాననినుమాన
నినుగానకిక నేను నిలువలేను

సీలీలగనబాల శ్రీలోలనన్నేల
రావేలయీలీల రమ్యశీల
నాపాపములబాపు మాపదలోవనీ
పాపిపోంతి దీపరాశ్రిదీప
నినువినాభువిలోన జనకదిక్కెవరగాన
ననుమానమునుబూన నగునెలోన

గీ॥ నేరముల నారయకుమింక నిష్కళంక
చింతలనుబాపుమిక నైప శాంతరూప
సంగములద్రించు భవభంగ మంగళాంగ
యాశలుపుద్రుము శ్రీశ నాకేశయీశ.

సీ॥ పాపంబులనుబాపు వ్రిభుకనైనీవృంద 62
పాపినంచును భయపడఁగనేల

యాత్రరక్షకుఁడవీవై యుండ వెతలచే
వేసారలేనంచు విసుగనేల
నిఖిలంబుగనుచుండి నిర్భయంబుగ నేలు
విభుఁడవీవుండంగ వెఱువనేల
దాసులరక్షించు దైవమైనీవుండ
దిక్కులేదని మదిస్రుక్కనేల
గీ॥ దండిదొరవయ్య నినునమ్మి యుండమాకు
నిహపరంబులయందైన నేమికొఱత
సకటాక్షంబె ధృఢముగా నిలువవలయు
గాక యితరంబులకు భీతిగలుగనేల. 63
సీ॥ ఇంద్రియంబుల నిగ్రహించి నీధ్యానంబు
జేయుచున్నను సీదు చింతమాన

ఇలపెక్కు సత్కార్యములఁ జేయు
చున్నను దుష్పథంబులనెందుఁ ద్రొక్కబూన
సత్యమార్గంబున చరియింపుచున్నను
సన్నుతంబులను మాటిమాటబూన
మహాదానధర్మాది మహితకార్యంబులఁ
గావింపుచున్న నీ సేవమాన
గీ॥ సంగములఁ బాసి సిరిఁ ద్రోసి సన్యసించి
యోగినిగా నయున్నను నుర్వితుచ్ఛ
విషయభోగంబులను గోర వినుము దేవ!
ఇంతనీ వేమిదోషంబు లెంచఁగలవొ? 64
సీ॥ కష్టముల్ వెన్వెంటఁ గల్గుచున్నను నీదు
కరుణగల్గిననొదుఁ గొఱఁత లేదు

సంసారమునువీడి సన్యసించినను నా
సక్తివీడకయున్న ముక్తిలేదు
ఇంద్రియనిగ్రహం బించుకంతయులేక
పతనమాత్రంబున ఫలములేదు
బాహ్యాంతరంబులఁ బరిశుద్ధిలేకున్న
యర్చనంబున మోక్ష మరయలేదు
గీ॥ వేషభాషలచే విఱ్ఱవీగుచెల్ల
నవనిదుఃఖంబె కాని సౌఖ్యంబులేదు
వేదవేదాంగముల నెల్ల వినిననేమి.
స్వానుభవమున కిన్నైన సాటిరాదు. 65
సీ॥ ఉత్సాహపూర్ణమై యుండెగా హృదయంబు
తావక నామామృతంబుగ్రోల

ఆనందమాయెగా నద్భుతంబైన నీ
మహిమల నిరతంబు మదిఁదలంప
ధన్యమయ్యెనుగాదె తనువుసమర్పించి
నిశ్చింతతో భక్తినిన్నుఁగొలువ
సంతోషమాయెఁగా సర్వేశనీదివ్య
చరితాంబుజంబుల స్మరణసేయ
గీ॥ కోటిసుఖములు నీకృపసాటియగున
కోరితమాకేలగల్గు నీ కరుణగలుగ
స్వాంత మత్యంతసంతోషవంతమయ్యె
సర్వసుకీర్తి భువనైకచక్రవర్తి.
సీ॥ గంభీరమయ్యెను గనుశాంతమైయొప్పు 66
కడలిచందంబింత కనులఁగనిన

భీకరోజ్జ్వలుండయ్యు లోకోపకారియౌ
మార్తాండు నతికృపామహిమఁగనిన
దివ్యతేజముతోడ దివినిబ్రకాశించు
పున్నమచందురు పోలుపుగనిన
చిత్రవిచిత్రమై నేత్రోత్సవముగొల్పు
కడలేనిబ్రహ్మాండ గణముగనిన

గీ॥ అద్భుతంబగుఁ బరికింప నవనిలోన
దేనిఁగాంచినఁగాని యో దేవదేవ!
నీమహాశక్తియే తోఁచు నిశ్చయముగ
తృప్తిగల్గునె భవదీయ సృష్టిగనిన
నిన్నుగొనియాడ దరమౌనె నిర్మలాత్మ. 67

సీ॥ అంతరంగంబున నాశాలతలద్రుంచి
వేవేగ ముక్తికై వెదుకవలయు
కాలంబమూల్యంబు గడపబోకుడి వృథా
న్యాయంబు దప్పక నడువవలయు
నేప్రొద్దు విషయంబులే కోరసుఖమేమి?
దైవంబు నెదలోనఁదలపవలయు
నిలను మానవజన్మ మెత్తిననేమాయె
నరులార! సార్థకపరుపవలయు
గీ॥ బాహ్యవేషంబులెల్ల నిష్ఫలమొగాదె
చిరతరహిత బాధాలఁజిక్కుపడుచు
జనన మరణాద్యవస్థలఁగనుట మేలె?
క్షణసుఖంబుల కాంక్షఁజనునె? మాం॰కు. 68

సీ॥ చంద్రుండునీయాన జల్లనికాంతిచే
వెలుఁగఁడే రేయెల్ల విసుగకుండ
దినకరుం డనుదినంబును బ్రకాశింపఁడే
తలదాల్చి నీయాజ్ఞదప్పకుండ
అలసముద్రుండు నీయాజ్ఞలో మెలఁగఁడే
మిగులభక్తిని మేరమీఱకుండ
పంచభూతంబులు భక్తినీయాజ్ఞల
విడనాడకెవ్వేళ నడచుచుండ
గీ॥ నుత్తమంబగు నరజన్మమెత్తినార
మనుచు గర్వించుటే కాని యకట! మేము
నెన్నఁడైనను శిరసావహించినామె
భక్తినీయాజ్ఞ నొకసారైనఁ బరమపురుష॥ (౬)

సీ॥ దాసులేమైననిందలు సేయుదురటంచు
బలుకకుంటివె నీవు పద్మనాభ
భక్తులునీవెంటబడి వత్తురోయంచుఁ
గనఁబడకున్నావె కలుషహారి
వచ్చినంత నెనిన్న వదలఁబోరనియెంచి
రాకుంటివేవేగ లోకరక్ష
యరయనేఁకవీర లజ్జలక్షైనన
న్ననిమోసగింతువో యంబుజాక్ష
గీ॥ పట్టితిమిగట్టిపట్టిక నెట్టులైన
నిన్నుగాంచక విడువమో కన్నతండ్రి
రోషకోధింతు విఁక మమ్మేలుకొనుము
పతితపావన బిరుద మిప్పటిదిగాదు.

సీ॥ చంద్రుఁడు చల్లగా జనుల నేలుచునున్న
సర్వేశ! భవదీయ శక్తిగాదె
క్రమముగా భానుండు కాంతి నిచ్చుచునున్న
జనక నీదివ్య తేజంబుగాదె
అనిలుండు జీవుల కాధారుఁడై యున్న
నతిలోకమైన నీయాజ్ఞగాదె
పంచభూతంబుల ప్రజ్ఞలు వేయయ్య
మహినేకమాట నీమహిమగాదె
గీ॥ జగతి సర్వంబు నీచేత జరుగుచున్న
ఘనతరంబైన నీపూర్ణకరుణగాదె
యెంతవారము నీమహాసృష్టిలోన
మమ్ము విడకయ్య నిన్ను నేఁడుంటిమనుచు. 71

సీ॥ నేనెంతవాఁడను నిఖిలమీవనుచునా
సక్తినిన్గొలుచుటే భక్తియండ్రు
అన్నింటిలోనీవె యున్నావనుచు సేవ
గావింపనదియె సత్కర్మయండ్రు
నీవునేనొకటియేగా వేరులేదంచు
సర్వత్రనినుజూడ జ్ఞానమండ్రు
బాహ్యాంతరింద్రియవ్రాతంబుగట్టి సం
యోగంబుఁ జేయుటే యోగమండ్రు
గీ॥ పూర్వజన్మార్జితంబైన పుణ్యమునను
నెవరికెయ్యది సులభమై యిష్టమగునొ
కర్మయును భక్తిజ్ఞానయోగములలోన
దేననైనను నినుగంద్రు దేవదేవ! 72

సీ॥ మానితనవరత్న మకుటాంకగవికోటి
సుందరాకార నిం జూడగలనె?
ఆర్త రక్షావనా యఖిలాండకోటిబ్రి
హ్మాండనాయక నిన్ను మరువగలనె?
లావణ్య తేజోవిలాస యోగసర్వేశ
వేదాంతవేద్య నిన్వెదకఁగలనె?
కల్యాణగుణభక్త కామితార్థప్రదా
శ్రీరమావరనిన్నుఁ జేరఁగలనె?
గీ॥ పాపభూయిష్టమైన ప్రపంచమందు
నీకటాక్షంబులేకున్న నిలువఁగలనె?
దివ్యమంగళరూప సుకీవిహార
చిన్మయాకార రార నాసేవగొనర.

సీ॥ నీమహాసృష్టి వర్ణింపనేరితరంబు
చోద్యంబుగాఁదోచుఁ జూడఁజూడ
అణువునైననుబోల నయ్యానన్నేరీతి
మదినూఁతువో లేక మఱతువేమొ
పరమేశ! నీప్రియ భక్తులందఱిలోన
నేజ్ఞప్తియుందునే నీకునింకఁ
కరుణ నన్నొకకంటఁగనిపెట్టియుండవే
యజ్ఞురాలనటంచు నలుగకయ్య
గీ॥ ఉర్విఁ నీకన్న నాకెవ్వరున్నవారు
విన్నవించితి నున్నదియున్నయట్లు
ఆదరింపవె మొఱనాలకించి
నామభారంబు సర్వంబునీవెనమ్ము. 74

సీ॥ సిరిసంపదలనిచ్చి దరిచేరలేకుండ
మరపించుచుండెడి మహిమనీదె
నాయిల్లువాకిలి నాపిల్లకెల్లలన్
భ్రమలగల్పించెడి ప్రజ్ఞనీదె
అంతటనుండియు నగుపడకుండనే
మమ్ముశోధించెడి మాయనీదె
నీసన్నిధినిగోరి వేసారినను గాని
సరసఁజేర్పని ఘనశక్తినీదె
గీ॥ ఎంతవారము నీమాయ నెరిగితిరుగ
మహితమహిమాన్వితుండ విమ్మహిని నీవు
మతివిహీనను నిన్ను నే వెతుకఁగలనె?
జీవదేవుల నిటువేరు చేయనేల. 75

సీ॥ నిత్యుఁడవై నీవు నిండియుంటలనుండ
సర్వమస్థిరమంచు జడియనేల
ఆనందమయుఁడ వీవన్ని తావులనుండ
దుఃఖభావంబులు దోఁచనేల?
కల్యాణమూర్తివై ఘనుఁడవీవుండఁగ
లోనుండ జగతికి లోపమేల?
సర్వమంగళకళాసంపూర్ణుఁడవు నీవు
కృపగల్గనరులకుఁ గించ యేల?
గీ॥ అంతరాత్మయుఁ బరమాత్మ యరయ నొకటె
దేవ! నీవంశజులమాట జీవులందు
గాక మనకెందు భేదంబు గలదె జనక!
భ్రమలలోఁ జిక్కి మాయలోఁ బడుటకాక. 76

సీ॥ ఎనలేనిసౌఖ్యంబులెల్ల నాకిమ్మంచు
గొంతెమకోరికల్ గోరినాన
పరలోకసామ్రాజ్య పదవులెల్లనొసంగ
గట్టిగానినుఁ బట్టుబట్టినాన
ఇప్పుడే దర్శనంబిమ్ము లేకుండిన
నెట్లంచు నిన్నుఁబీడించినాన
కష్టంబులిక్కట్ల గలిగింతువనుచు ని
న్నయ్యా! నే నిష్ఠురమాడినాన
గీ॥ తెలిసిగినే చేయు నేరంబులేమిగలవొ
యున్న నోయన్న మన్నింపకున్న నెట్లు
నేను కించిజ్ఞురాలను నిఖిలమునకుఁ
గర్తయును భర్తయును నీవెగావె దేవ!. 77

సీ॥ ఏరాత్రిపుట్టునో యారాత్రియేతార
లంతరిక్షంబున నంతరించు
నేమెండచే పూవు లెలమిచేవికసించు
నాయెండవేడికే యావసిపోవు
నేగాలిచేఁగూడ వేగ మేఘంబులు
నాగాలిచేతనే యావిహరించు
నేమహాశ_క్తిచే నెల్లనుత్ప_త్తియా
నాశ_క్తిచే సర్వమైక్యమొందు
గీ॥ నిట్టిదేకదలోకం బికేలభ్రాంతి
వాసనలఁజిక్కి రాబోవువానిమరచి
యస్థిరంబైన సౌఖ్యంబు నాత్మనమ్మి
విలలనొందెదవేటికో వెఱ్ఱిమనస.

సీ॥ దాసునితప్పులు దండంబుతోసరి
యనుట యెఱుంగవో యంబుజాక్ష
దాసోహమనుచు నీదాపుఁ జేరినఁ గాని
నీచెంతఁ జేర్పవో నీరజాక్ష
నిన్నుఁ గొల్చినవారి నేరంబు లెన్నైన
మన్నింపఁగారావొ సన్నుతాంగ
కాపుగాఁ బెట్టిన కంచెయే చేనుమే
యఁగఁబూనదిక్కేది యబ్జనాభ
గీ॥ ధర్మమూర్తివి నీవు నిర్దయను బూన
నెట్లుమనఁగలవారమో యిందిరేశ
పదుగురికిఁ జెప్పనేర్చిన వాఁడవీవు
న్యాయమొక్కింత పాటించి నన్నుఁ గావు. 79

సీ॥ చల్లగావర్షించు జలధరంబులలోన
పిడుగులనేల గల్పించినావొ?
రమణీయతరమైన రత్నాకరంబున
బడబాగ్ని నేల యేర్పరచినావొ?
ఫణిఫణాదులలోన మణులనమర్చియు
గూర్రమౌవిషమేల పెట్టినావొ?
విషయభోగములందు వివిధసౌఖ్యములిచ్చి
వీలవిగా వెతలేల రచినావొ?
గీ॥ ముండ్లలోనగులాబియు మొలచినట్లు
బురదలోఁ గల్వపూవెట్లు పూయుచుండు
జ్ఞానదృష్టిని యోజింప జనునుగాక
దేవ! నీమాయ లేరీతిఁ దెలియఁగలము. ౩౦

సీ॥ నిర్గుణుఁడవుగావె నీవేల సృజయింతొ
సగుణరూపుండవై జగములెల్ల
ఆదిమధ్యాంతఁబు లరయ నింతయు లేని
నీవెట్లు హృదయాన నిలువఁగలవొ
దేవుఁడా నీవెట్లు జీవుండవై భువి
కర్మబంధంబులఁ గట్టువడెదొ
నిర్వికల్పుండవౌ నీకు నేరీతి సం
కల్పవికల్పముల్ కలుగఁగలవొ
గీ॥ తత్వమొక్కింత యోజింపదగును గాక
యేల సృష్టింతువో లయం బేల చేతొ
యేమొ సత్త్వవో నీమాయ లెవ్వఁడెఱుఁగు
నీయభీష్టమదేమొ యోనిర్మలాత్మ.

సీ॥ ఎన్నియోగమార్గంబు లున్నవినినుకేర
నజ్ఞులైనలు విన్నరయురకట
తారకంబుజపించి తరియింపగాలేర
పంచాక్షరినిముక్తిగాంచలేర
మంత్రరాజంబని మహినుతికెక్కిన
ప్రణవంబుననుముక్తిబడయలేర
అన్నింట నుత్కృష్టమామార్గమిదిసర్వ
మతసమ్మతంబైన మంత్రమరయ
గీ॥ అవనికతకోటినామంబులం దనంత
కోటిరూపంబులనుదాల్చికోర్కెలిచ్చి
ముక్తినొసగెడియోంకారమూర్తివీవు
ప్రణవమంత్రస్వరూపుఁడ ప్రభుఁడవీవు. 82

సీ॥ అంతటనిండిన యాకాశసం బెప్పుడు
ప్రణవమంత్రము నే పల్కుచుండు
హోరుహోరంచుమహాంబుధి యెప్పుడు నీ
దివ్యనామమును గీర్తించుచుండు
జగములనెల్ల భస్మంబు జేసెడునగ్ని
నిన్ను నేమరక ధ్యానించుచుండు
జీవకోటులకెల్ల జీవనంబౌగాలి
దేవ! నిన్నే సంస్తుతించుచుండు
వర్షమెప్పుడుచాల హర్షంబుతో నిన్ను
ప్రస్తుతించునొ యనంబాడుచుండు
గీ॥ అఖిలభూతంబులెల్ల నహర్నిశంబు
ప్రణవమంత్రంబె ఘనముంచుబరగఁజేసి

దివ్యతరమైనముక్తిసాధించుచుండ
మూలపురుషుండవోంకారమూర్తివీవు
నరులుగనరైరి నీదివ్యనామమహిమ. ౮౩

సీ॥ జననమొందకమున్నె జంతుజాలమునకు
సకలమిచ్చిన దయాశాలివండ్రు
దిక్కులేకలపించు దీనమానవకోటి
నరసిరక్షించెడి యాప్తుడండ్రు
అడుగకున్నను సమ్మరైన బెట్టదు నీవా
కోరకే సర్వంబు గూర్తువండ్రు
ఖలులనైనను వారికష్టంబు లెడబాపి
కరుణనేలెడి మహాఘనుఁడవండ్రు

# భక్తిరసామృతము.

గీ॥ పరమకరుణాసముద్రుఁడా ప్రభుడవనుచు
నిగమములుగూడ నిన్ను వర్ణించుచుండ
జీవులెల్లరు వెతలలో జిక్కి యుండ
యేలచూచుచుమంటివో యెఱుఁగనయ్య.

సీ॥ బ్రహ్మాండకోటుల బంతులరీతిగా 84
సృష్టించినాడవు చిత్రరీతి
భువనముల్ బొంగరంబులమాడ్కి తిరుగంగ
నిర్మించితివి కడునేర్పుతోడ
పంచభూతములఁ బ్రపంచము లెల్లఁ
గల్పించి నత్యంత వింతదోఁప
సూర్యచంద్రాది తేజోవిలాసంబుల
జేసినా వెంతయో చెన్నుమీర

గీ॥ ఘనుఁడవీవాదు వదియునిక్కంబెగాని
దుఃఖమయమైన లోక మొందులకునిట్లు
సౌఖ్యవంతముగాఁ జేయఁజాలవయ్య
నీదుశక్తికి పరిమితి లేదుకాద
యయ్య! యీచిత్రమేమొ చెప్పరాద. 85

సీ॥ క్షితిసూర్యచంద్రుల సృష్టించితివి దయా
శాలివై మాబోటి జనులకొరకు
సకలచరాచర జగమద్భుతముగనే
ర్పరచుట నీశక్తి నెరుగుకొరకు
వివిధంబులౌ కష్టవితతులనెన్నియో
గల్పించితివి ముక్తిగాంచుకొరకు

లలిని నెన్నదినాల్గులక్షల జీవరాసు
లసృజించితివి నిన్ జూచుకొరకు
గీ॥ జహాళపరిశిభా విశాలితా ప్రభుడవంచు
కష్టములగూడ నేటికిగలుగజేతొ
మీదు కర్మంబటంచు నమ్మింతువేము
నీదు నిర్మాణమేగాదె నిఖిలసృష్టి
యెవుడు సౌఖ్యంబె గల్గింప వేటికయ్య. 86

సీ॥ బలవంతముగనన్ను బంధనంబులద్రోసి
శ్రమలబెట్టుటనీకు జ్ఞప్తిలేదొ
చాలు నీసంసారజాలంబునికనొల్ల
ననుచు నీదరి జేరుటరయు లేదొ

పసినాటనుండి నిన్ను ప్రార్థించునాదీన
మొరలు నీవీనుల జొరగలేదా
వరుస దిరిగినగాని విషయాంశములను నాదు
తలపు చుట్టితివంచు తెలియలేదా
గీ॥ నీవు సర్వజ్ఞుడవయ్యు నిన్నిమిత్త
ముగను కన్నుల వెతలలో ముంచినావా
మొరగి చేసితివెల్ల నీ వెరుగనట్లు
కడకు మాకర్మమందువు గాదె దేవ!. 87
సీ॥ సకలసౌఖ్యముల బ్రసాదింపవేయంచు
నతిదీనముగను నిన్నడుగనేల
యేలోపములు లేక కృపజూడరమ్మంచు
ప్రీతితో బలుమారు బిలువనేల

మహితుండవీవయ్యు మాకష్టసుఖముల
నాలింపుమనుచు నిట్లడలనేల
జనకనిల్గొలుచు నీతనయులనొక్కింత
నీపాదసన్నిధి నిలుపవేల
గీ॥ ఎంతవారము శోధింపనెంతువేల
బిడ్డలనుబ్రోవ నీకింతబింకమేల
లేవ దీనులపాల వేరావదేల
తండ్రివయ్యును సాధింపదలతువేల.
సీ॥ పరమారు నేనిన్ను బ్రార్థించితినిగాని ౪౬
చిత్తమేకాగ్రింబు జేయలేను
ఎపుడునిన్సేవింప నిచ్ఛగించితిగాని
దేవ నీమహిమగీర్తింపలేను

మదిలోననిన్ను నేమరువకుంటినిగాని
త్రికరణశుద్ధిగా దిరుగలేదు
ననుబ్రోతువెల్లన ననుచునమ్మితిగాని
యింపుగానిన్ను బూజింపలేదు
గీ॥ ధ్యాన మష్టాంగయోగసాధనములందు
నుత్తమంబని చిత్తమందత్తెరంగు
నిన్నుధ్యానింతునోతండ్రి నన్నుబ్రోవు
నితరయోగంబులెరుగనే నిందుకైన. 89

సీ॥ స్వాతంత్రుడవునీవు జనులనెట్లాడించి
ననుగాని నిన్నేమనగనేర్తు
స్వల్పజ్ఞులము మేము సర్వజ్ఞుడవునీవు
కనులనిన్నేరీతి గనగనేర్తు

అవివేకులము నీసహాయంబు లేకున్న
కష్టంబు లేరీతి గడవనేర్తు
కించిజ్ఞులము మేము కీర్తిమంతుడవీవు
నీనామ మెట్లు వర్ణింపనేర్తు
గీ॥ నీసమానులమైనను మోసపుచ్చి
మాయలోద్రోసి జ్ఞానంబు మరుగుచేసి
జీవులమటంచు నిరసన జేయనగునె
దేవుడవు నీవు నిన్నెట్లు దెలియనేర్తు.
॥ నీనామమంత్రంబు నిత్యంబు జపియింప ౧౦
కష్టనష్టంబులు గలుగబోవు
నీదివ్యపాదంబులే దిక్కనుచు నమ్మ
తాపంబులిక తల జూపలేవు

నీమూర్తిమదిలోన నిల్పిధ్యానించిన
జన్మకర్మములు నమసిపోవు
నిఖిలంబునీవని నిజభక్తి సేవింప
నరకాదిబాధ లెన్నటికిరావు
గీ॥ మొఱిగి సేవింపవలెగాక యీశ నిన్ను
కామధేనువు కల్ప వృక్షంబెగాక
మేటిచింతామణియు నీకు సాటియగున
తండ్రి! నిన్ను వర్ణింప సాధ్యంబె నాకు. 91
సీ॥ స్థావరజంగమాత్మకమైన సర్వవి
పంచభర్తా! నాదు ప్రణుతిగొనుము
అండపిండాండ బ్రహ్మాండనాయకుడవీ
పతికృప నాదు సన్నుతులవినుము

శరణాగతత్రాణ బిరుదాంకితుడవీవు
నీకిపయిలమింక బోధింతునవము
సకలసృష్టిస్థితి సంహారకర్తవీ
వతికృపనాదు సన్నుతులవినుము
గీ॥ మదిని నెరనమ్మినాము నామాటనిజము
యెట్లుగానున్నదో గతియెరుగలేము
అయ్యా నీచిత్తమింక యేమనగలేము
కలతదీర్పగరమ్ము దీనులము మేము. 92
సీ॥ వరిత్యాహంబునసీదు పాదపద్మంబుల
సేవింతుహృద్గత చింతదీర్ప
తావకదివ్యసం దర్శనోత్సాహినై
వచ్చితిమన్మనో వాంఛదీర్ప

అడుగఁద్దునను నీ దయారసంబునుఁగోరిల
నభిలషించితినాదు యానదీర్పు
పటుతరంబగు లోక బాధలబడలేక
వెరచి నిన్నరణంటి వెతలదీర్పు
గీ॥ కామితార్థప్రదుండవౌ ఘనుఁడవీవు
అకటనీయంతవాని నేనాశ్రయింప
రిత్తవోవున నాకోర్కెలిత్తెరంగు
నిష్ఫలంబుగ జేతువే నీవె దేవ!
సీ॥ చోద్యమైనట్టివస్తువు నెద్దియైన నీ 93
క్షించినంతనెయతి చిత్రమొంది
యాహాహాదినినొనర్చినట్టి వారెవరోకో
యనుచుకర్త నెరుంగ నభిలషింతు

ఈరేడుజగముల నెల్ల నద్భుతరీతి
నిర్మించినట్టి నీ నేర్పునింత
మదిదలంపక నీదు మహిమయే మరచుచు
సర్వంబు నైజ మీజగతియనుచు
గీ॥ కలడొ లేడో యటందురు నిన్ గానలేక
యొందునీశక్తియే గోచరించుచుండ
ప్రీతికేల్మోడ్చి నిన్ను సేవింపలేక
మతివిహీనులవోలె నిన్ మరచుటెట్లొ. 94
సీ॥ చదువునేర్చినఫలం బెదలోన దన్ను దా
నెరుగుటేగాదె యోపరమపురుష
మానవుండైదానుమహినుద్భవించుట
ధన్యుడౌటకె గాదె ధర్మమూర్తి

అన్నింటనరజన్మ మాధిక్యమనుచున్న
నినుజేరినసిగా దెనిర్మలాత్మ
సత్కార్యముల నెన్నొ సల్పి మెప్పొందుట
నీప్రీతికొరకె గానిమ్మకింక
గీ॥ అన్నిటనునిన్నదా నెవ్వడరయగలడొ
ప్రేమసర్వంబు నెవ్వడర్పింపగలడొ
ఉండిలేనట్లుభువి నెవ్వడుండగలడొ
వాడధన్యుండు పుణ్యుండు వసుధలోన.
సీ॥ ఎపుడునామనసార ఈశ నీ నామామృ 95
తంబుగ్రోలితనించుదలపగలనొ
మెపుడునావిఘ్నములలో నేవిధంబైనలో
పంబు లేదనిధృవపరుపగలనొ

యెపుడుకష్టాలన్ని యెత్తివచ్చినగాని
మదిచలింపక వేడ్క మసలగలనొ
యెపుడునాజీవంబు తెగిపోయినగాని
భయములేదంచును బలుకగలనొ
గీ॥ యెపుడునీయందు నాచిత్తమేకమగునొ
యెప్పుడింద్రియములనిగ్రహింపగలనొ
అప్పుడేనీదుదర్శనం బగునుగాని
యిప్పుడేరమ్మనుచుబిల్వనేమిఫలము. 96
సీ॥ కలిగినవాడుకాల్ గదలించులోపల
బీదలప్రాణముల్ వెడలునపుడి
ఆర్యోక్తిలపురానగు నెర్నికరణంచు
వర్ధించుచోగూడనార్తింతు

నిర్వ్యాజకారుణ్యనిధి యన్న నీ పేరు
వాసి యే దయ భక్తవత్సలుండ
పుట్టక మున్నె యీ భూతకోటికి నన్న
స్తంబు చేకూర్చినసదయుఁ డందు?
గీ॥ నేఁడు రక్షించు మటు వేఁడ నేర వేని
నీదు కీర్తికి లోపంబుగాదె దేవ
ఇంత నీచిత్తమయ్యె నిన్నేమనందు
తెలిసి గావించువారిఁ దెలుపఁగలరు.
సీ॥ కామాదిశత్రువర్గము చెంతరానీక 97
తరుముఁగా వానినిదరుమవలయు
కాలసర్పం బెప్డు కబళింపనున్నది
కడు జాగరూకతఁ గడుపవలయు

విషయముల్ చవిజూపి వెతబెట్టనున్నవి
మెలకువతో సదా మెలగవలయు
చిల్లరగురువులు చెడగొట్టనున్నార
లోకకంట గనిపెట్టి యుండవలయు
గీ॥ సర్వలోకైకసాక్షి యీశ్వరుడె యనుచు
సకలమునకును కర్తదానొకడె యనుచు
ముక్తినొసగుటకీశుడే మూలమనుచు
నిలను జన్మించుమానవుండెఱుగవలయు. 98
సీ॥ హరిహరీ యనినంత హరియింపకుందువా
యెఱిగి జేసినయెల్ల దురితములను
మాంరక్ష యనినంత మన్నింపకుందువా
నేరక కావించు నేరములను

శరణన్నమాత్రాన క్షమియింపకుందువా
రయమున సర్వాపరాధములను
పాహిపాహియటన్న బాపక యుందువా
పలుమారుగావించు పాపములను
గీ॥ ఎన్నఁడో యేమొ జేయ నవేటికయ్యా
యిరుకునీసన్నిధికివచ్చి యిన్నిగతుల
వేడుకొనుచుంటి నన్ను గాపాడుమయ్యా
విడువ నీపాదపద్మముల్ జనువనింక. 99
సీ॥ కరుణార్ద్రచిత్త నీ గతినుండ వనుచునే
బిలిచితిననుచు గోపింపబోక
సకలాంతరాత్మ నిన్నొకచోట కదలక
నిలుమంటిననుచు సన్నలుగబోక

నిర్మలాత్మకుడవా నిను పక్షపాతివం
చనిననాపై నెట్టి కినుక లేక
యెరిగిచేసినగాని యెల్లదోషంబుల
క్షమియింపుమంటినా శంక లేక
గీ॥ వేగరమ్మంటినని మదివిసుగకొక
మరల దుఃఖాదులనుబడి మ్రగ్గనీక
చిన్నిసుతులచేపట్టి రక్షింపుమింక
దేవదిక్కెవ్వరున్నారు? నీవెగాక. 100
సీ॥ ఈశ్వరా! కనిప్పుడే తెంచి నిన్ను నే
మనసారవాంఛించు మనవివినుము
సర్వాపరాధముల్ క్షమియించుటొక్కటి
నీవునామదిలోన నిల్చుటొకటి

నిరతంబు నిన్ను నేమరకుండుటొకటి
యిహపరసౌఖ్యంబు లిచ్చుటొకటి
ఆయురారోగ్యభాగ్యము లిచ్చుటొకటి
మన్మనోదుఃఖంబు మాన్పుటొకటి
కష్టముల్ దొలగించి కాపాడుటొకటి
దేహాదిబాధల దీర్చుటొకటి
గీ॥ వాంఛితార్థప్రదుండవౌ ప్రభుడవనుచు
కొరతగల్గదు నీభక్తవరులకనుచు
కరుణ నాకోర్కెలీడేర్ప గలవటంచు
నాశ్రయించితి నీశ! నన్నాదరించు. 101
సీ॥ భారంబునీదని భక్తిమీరికొలిగాని
పిలిచి నిన్నలవంత బెట్టనైతి

పాదపద్మంబుల బట్టి వేడితిగాని
దార్ఢ్యమున నిన్నుదలపనైతి
పాపంబులను బాప బ్రతిమాలితినిగాని
అతివాదమున దూలనాడనైతి
దేవనాకికదిక్కు నీవెయంటినిగాని
యితర దైవంబుల నెంచనైతి
గీ॥ మరలనొకమారు బల్కుమా మానివంద్య
ప్రేమపూరితమై సదా ప్రియములొల్కు
నీదువాక్యామృతంబుచే నిశ్చయముగ
నన్ను నానందమునముంచినావు నేడు. 102
సీ॥ చిత్తంబు నీపాదచింతనం బే కాని
యన్యథాతలపోయ నాశపడదు

నిమరలేచినదాది నీధ్యానమేకాని
నితరకార్యంబుల కిష్టపడదు
పరసౌఖ్యముల నెట్లు బడయుదునన గాని
ప్రాపంచికములకై పరుగులిడదు
అంటియుంటక సర్వమందుండునేగాని
చిల్లరవిషయాల చెవులనిడదు
గీ॥ ఇట్టి హృదయంబదొకవేళ యించుకంత
చంచలము బొంది యేదేని సలిపెనేని
యాగ్రహంబొందగా నేల యకట నీవు
తెలుపగారాదె మదిదయగలిగెనేని. 103
సీ॥ నీకేమి భయమమ్మ నేనుండగా నింక
నిన్ను రక్షింతునం చన్నవరకు

సర్వాపరాధముల క్షమియించితినినీకు
భయమింక లేదని పలుకువరకు
యిహసుఖంబుల లోపమింతైన లేకుండ
కంటికి రెప్పయై గాచువరకు
నాబిడ్డవేనీవు నాసన్నిధిని జేర్తు
నెట్లయిన నని వరమిచ్చువరకు
గీ॥ కాలమొకరీతి నెట్లటో గడపుచుందు
బ్రతికియుండియు జీవచ్ఛవంబనగుచు
కంటివో లేదో దేవనాకష్టములను
వింటివో లేదో నాచిన్ని విన్నపముల. 104
సీ॥ దినదినంబును నీదుదివ్యమంగళవిగ్ర
హంబునుసేవించు నధికశక్తి

ఘనగుణంబులనునీదు సంకీర్తనము జేసి
యానందమొందు నత్యంతభక్తి
జన్మజన్మాద్యవస్థలపాలు జేయు నీ
హైహికంబులయందు నతివిరక్తి
అఖిలలోకాధినాయకుఁడవౌ నీలోన
నైక్యంబు నొందెడు నట్టిముక్తి
గీ॥ యిహపరంబుల కీర్తివహించుయుక్తి
మంచిచెడ్డల గుర్తించు మహితశక్తి
కేవనాకిమ్ము నినుగొల్తుభావమందు
భువనసంస్తుతకీర్తి యోపుణ్యమూర్తి. 105
సీ॥ ఝషకమై కూర్మమై జలధిలోపలజొచ్చి
యుద్ధరించితివి మున్నొక్కమారు

శ్రీవరాహంబవై నృసింహమవై దైత్యుల
నుక్కడంచితివి మున్నొక్కమారు
మరివామనుండవై పరశురాముండవై
చక్కజేసితివి మున్నొక్కమారు
శ్రీరామమూర్తివై ద్వారకావిభుడవై
యుర్విబ్రోచితివి మున్నొక్కమారు
గీ॥ ధర్మసంస్థాపనార్థంబు ధరణిలోన
యుగయుగంబున జన్మించుచుందువందు
హీనగతినుండె లోకమంచెనుగ వేగ
యింకనైనను రావుంటివేల దేవ!. 106
సీ॥ విగ్రహారాధనల్ వెలసిలోకంబందు
ప్రజలుదుర్మార్గులై ప్రబలినపుడు

లేదటంచును బోధింపలేదె నీవు
ప్రీతి నద్వైతమతము స్థాపించలేదె. 108

సీ॥ శ్రీశంకరుని బోధ చిత్రంబుగా గొంత
కాలంబునను మారి క్రమము దప్పి
అద్వైతమన భేద మరయకుండుటగా దా
యనుచు దుష్కార్యంబు లాచరించి
నాకన్న దైవంబు లోకంబునను లేడ
టంచు నిర్భయముగా నంచరించి
నీది నాదేకదా నీవు నేనొకటంచు
జారచోరత్వముల్ జరుపుచుండ
గీ॥ వచ్చి రామానుజుండవై యవతరించి
అవనిజీవేశ్వరులు వేరటంచు దెల్పి

భక్తియేతోఁవ పుణ్యపాపములుగలవు
గలదు మోక్షంబు శిక్షయు గలదటంచు
ద్వైతమతముస్థాపించిన దైవమీనె. 109

సీ॥ కనులారగాంచుమా కరుణాంతరంగుడు
ర్భరమైన లోకదౌర్భాగ్యదశను
క్షామదేవతనోట జనులు సుక్కికృశింప
పలువిధరోగముల్ బాధపెట్ట
ప్రతిచోట రక్తప్రవాహముల్ ప్రవహింప
ఘోరసంగ్రామముల్ గూల్చుచుండ
భిన్నమతస్థులై ప్రేమరాహిత్యులై
యైకమత్యము లేక యఖిలజనులు

గీ॥ అంధకారంబులోఁబడి దుఃఖులగుచు
వేచియున్నారు రక్షింపవేగరమ్మ
మరలజగముద్ధరించగా తరుణమిదియె
నరగనవతారమునుదాల్చు సమయమిదియె. 110

సీ॥ శాస్త్రదోషంబులీషణ్మాత్రిమెరుగని
మత్కవిత్వముఁ బ్రేమ మనిచినావు
సత్కార్యములనేను సలుపకున్నను బిన్న
పెద్దలచేత మెప్పించినావు
అంతరింద్రియ నిగ్రహంబు లేకున్నను
పిలిచినంతనె బదులు పలికినావు
సమయమెరింగి నిన్ స్మరియింపకున్నను
కష్టముల్ దొలగించి కాచినావు

గీ॥ కలమెలెక్కింప నీయుకారములను
మరువఁగాఁజాల యెన్నిజన్మములకైన
నన్నురక్షింప నీవంతు నిన్నుమదిని
విడువకుండుట నావంతు వినుమదేవ. 111

సీ॥ మూఁడుమూర్తులకాదిమూర్తియై నావిరా
ట్పురుషుండు మమ్ముల బ్రోచుగాక
ఎల్లజగంబుల సృజియించిమించిన
యబ్జసంభవుఁడు మమ్మరయుఁగాక
క్షరమునక్షరమును సంరక్షణమొనర్చు
శ్రీహరి మమ్ము రక్షించుఁగాక
అఖిలంబు లెనయుండై యైక్యంబుగావించు
నాదుశంకరుఁడు మమ్మేలుఁగాక

గీ॥ పలుకుల వెలంది మమ్ము గాపాడుగాక
కలుములవడంతి మమ్ములఁ గాచుగాక
భూధరేశ్వరుపుత్రిక బ్రోచుఁగాక
శ్రీమహాశక్తి మము దరిఁజేర్చుగాక.

సీ॥ భక్తవత్సలుడవై ప్రజలగాపాడు నీ
పాదాంబుజములకు వందనంబు
కల్యాణమూర్తివై ఖలులనైనను బ్రోచు
పరమపావన నీకు వందనంబు
అతిదయాశాలివై యాపదలడచు
వరగుణాఢ్యుడ నీకు వందనంబు
కల్పవృక్షంబవై కామితార్థములిచ్చు
ప్రభువరా నీకిదే వందనంబు

గీ॥ పాపసంహార నీకిదే వందనంబు
వరదయాకర నీకిదే వందనంబు
బంధమోచన నీకిదే వందనంబు.
భక్తకల్పద్రుమా నీకు వందనంబు 113

సీ॥ జగదేకనాయకా సర్వాంతరాత్మకా
మహనీయగుణతేజ మంగళంబు
ఆపదుద్ధారకా యార్తసంరక్షకా
మహాతిశయానంద మంగళంబు
కామితార్థప్రదా కరుణించవేసదా
మానితాత్మా నీకు మంగళంబు
దేవదేవోత్తమా తేజోవిలాసమా
మానివంద్యా నీకు మంగళంబు

గీ॥ సంగరాహిత్య నీకిదే మంగళంబు
మారసంహార నీకిదే మంగళంబు
మమ్ము రక్షింపవే నీకు మంగళంబు
మా నమస్కృతిగొనుమిదే మంగళంబు. 114

సీ॥ పరమేశ! భవదీయ కరుణాకటాక్షంబు
నిరతంబుమాపైన నిలచుగాక
నరులునీయాజ్ఞల శిరసావహించినీ
పదసేవభక్తి సల్పెదరుగాక
యీప్సితార్థంబుల నేకొరంతయులేక
దివ్యమైభగము వర్ధిల్లుగాక
సత్యంబుధర్మంబు శాంతియునీతియు
పుడమిలోనభివృద్ధి బొందుగాక

గీ॥ దుష్టగుణములు మొదలంట దొలగుగాక
పృథ్విసద్గుణవంతమై వెలయుగాక
నిఖిలమును సౌఖ్యదాయమై నెగడుగాక
శీఘ్రమే మాకు మోక్షమిచ్చెదవుగాక. 115

సీ॥ ప్రజలునీభక్తులై ప్రబలుచుందురుగాక
వారియభీష్టముల్ దీరుగాక
జనులెల్లనీసేవ సల్పుచుందురుగాక
యుర్వినేకొరత లేకుండుగాక
పంటలుపైరులు వర్ధిల్లుగాకనీ
కరుణాసువృష్టి యేకురియుగాక ౧
నీయిష్టమే యెందు నెరవేరుగాక స
ర్వంబు నానందమై పరగుగాక

గీ॥ ధర్మమిలనాల్గు పదములదనరుగాక
కష్టముల్ వీడి సౌఖ్యముల్ గల్గుగాక
కనులకింపుగ నిఖిలంబు గ్రాలుగాక
సత్యవతినేలెదవుగాక జాగులేక. 116

సీ॥ జన్మశతానేక సంస్కారలబ్ధమౌ
బహువిధపుణ్య ప్రభావముననొ
ధర జన్మజన్మార్జితంబైన నీదివ్య
కరుణాకటాక్షంపు కలిమివలనొ
పిన్నలుపెద్దలు ప్రేమపూర్వకముగా
గారవించెడి యనుగ్రహమువలనొ
తప్పులున్ననుగాని దయతోడ గైకొను
దైవమీవని యెడి ధైర్యముననొ

గీ॥ అనఘ! భక్తిరసామృతం బనెడి దీని
వ్రాసితిని; యెట్టులున్ననీ ప్రార్థనంబె
చిత్తగింపుము దేవ నాచిన్ని మనవి
భక్తసులభుండవనినిన్ను బ్రస్తుతింతు. 117

స ం పూ ర్ణ ము.

# అనుబంధము.

—పూజలింగము పోయినప్పుడు చెప్పిన పంచరత్నములు—

సీ॥ జనకమమ్ములవీడి చనినావా కృపలేక
తనయుల నెడబాయ దలచినావా
అజ్ఞానమున భవదాజ్ఞమీరితినంచు
నయ్యామామీద నీవలిగినావా
సుతులను మితిలేని వెతలలో ముంపంగ
నెంచి మమ్మిట్లువంచించినావా
మనను శోధింపంగ మమువీడిపోతివో
భక్తిచాలదటంచు బాసినావా

గీ॥ నిఖిలజగములు నీవెమైనిండియుండ
నొక్కలింగంబె నీవనుకొంటిమనుచు
బుద్ధిదెలుపంగ మముబాసిపోయినావా
పూర్ణకరుణాంతరంగ శ్రీపూజలింగ. ౧

మ॥ భవదాజ్ఞావళిమీరినన్ జగతినీ భక్తాళిగారించినన్
ఎవరిన్ జుల్కనజేసినన్ జనకనిన్నేమైన నిందించినన్
భువిలోసత్యముదప్పినన్ క్షమమునన్ బ్రోవందగున్ గానియో
శివమూర్తీయిటుబాసిపోవదగునా? శిక్షింబునన్ రాగదే! ౨

సీ॥ తండ్రిమమ్మొడబాయ దగినట్టియపరాధ
మొందునగావించి యెరుగనైతి
సర్వకాలంబు నీస్మరణజేయుటగాని
మానసంబుననిన్ను మఱవనైతి

బీదసాదలనెందు ప్రేమించితినెగాని
యొరులకష్టములన్న నోర్వనైతి
నిత్యంబునీపూజ నిష్ఠతో గావింప
దలచితినేగాని దప్పనైతి
గీ॥ మమ్ము నెడబాయమదినెంచి మరుగువడితొ
ఇంతమాత్రాన విడతురం చెంచితేమొ
భక్తియనుపాశమున నిన్ను బాయకుండ
హృదయమందైనబంధించి పదిలముగను
నిలిపెదముగాని నినువీడగలమె? జనక.

సీ॥ ఎత్తైనకొండపై నెక్కినంత నెనిన్ను
జేర లేననిచింత జెందబోను

పులిచర్మమునుగట్టి బూచులఱేడవై
జడలదాల్చినమాత్రి జడియఁబోను
కైలాసమునువీడి కాటిలోనివసించు
బిచ్చగాడనినిన్ను విడువబోను
సన్యాసివగిది వేసముదాల్చినంతనే
వరమీయకున్న నిన్వదలబోను
గీ॥ తనయులము మేము మాకడదాపనేల
యెరుగమే తండ్రి నీదివ్యచరితమెల్ల
దర్శనంబిచ్చి మమ్మేలదగునుగాక
మాయచే మోసగింపంగ న్యాయమగునె. ౮
సీ॥ అజ్ఞానముననిట్టు లయ్యనీకై నేను
విలపించి విలపించి యలసియుంటి

౫

సుజ్ఞానదృష్టిచే చూడగాచూడగా
నణువులో నహితమీవమరియుంట
చిత్రింబుగాదోచె చింతలన్నియుబాసె
రాకపోకలటంచు నీకుగలవె
ఇందులేవనజాల నెందుంటివననేల?
సందులేకనునిండి యుందువీవు
గీ॥ నీదుమాయను దెలియంగ నేర్తుమయ్య
తనయులముగాన నిన్నుపరిత్యక్తముగను
గాంచగోరితిమికనైన కరుణతోడ
వేగదర్శనమీయవే వేదవేద్య.

౫

—జబ్బుగానున్నప్పుడు వ్రాసినది—

శా॥ శ్రీవిశ్వేశ్వర! పాహియంటినిక నీచిత్తంబునాభాగ్యమో
దేవా! నామొరనాలకింప కృపరాదే దీనురాలంగదే
లేవా, భక్తులపాలివాడవయియీ లీలన్ బరీక్షింప నీ
భావంబొప్పెనె తండ్రి పిచ్చుకలపై బ్రహ్మాస్త్రమేల్గేయుదో.

—1918 ప్లేగుదినములలో జెప్పినది—

సీ॥ మృత్యువా! నాతోడ సత్యంబుబల్కుమా
యొకమాటనిన్నడ్గ నూహగల్గె
కాటికికాల్సాచి యేటికీబ్రతుకింక
ప్రపంచకార్తుల బాపిబ్రోవ
మరణమా! నీకైన కరుణరాదేయని
నిరతంబునీకునై స్మరణజేయు

వృద్ధులు వెతలచే వేసారు రోగులు
పలువురురమ్మని పిలుచుచున్న
వారలదరికేగ వడుసువారలెగాక
వసుధలో నాన్నాళ్ళు బ్రతుకదలచి
అనుకూలదాంపత్యమునజెలంగెడివారు
కాపురంబుల జేయ గడగువారు
దేశోపకారులై తేజరిల్లుచులెను
తను మనోధనముల ధారవోయు
పుణ్యచారిత్రుల పుడమినుంచక వేగ
గైకొందువిది యేటి కర్మమమ్మ
పసివారలైననీ పాలబడిర యేని
మాయంబుజేతువు మరలనీక

వృద్ధులదరి కేగ వెగటుగాదోచనే
పిన్నవారలనంగ ప్రియమె నీకు
కాకున్నవార లీలోకంబునను బుట్టి
చిరకాలమాటచే మరతువేమొ
కలికాలమహిమయే గాకున్న నీవిట్లు
తల్లక్రిందుగ జేయ దలచు టేల
గీ॥ జగతిబంధనంబుల బాపు సఖుడవీవు
వెతలనిమిషంబులో దీర్చు హితుడవీవు
సర్వసమవర్తివందురీ జగతినిన్ను
నీవె న్యాయంబువిసనాడ నీతియగునె॥

—సముద్రునిగూర్చి పంచరత్నములు—

సీ॥ గాంభీర్యమునజూడ కడుభయంకరుడవు
నైశ్వర్యమందు నత్యధికుడీవు
ఓర్పులో పరికింప నుత్తమోత్తముడవు
సద్గుణుడవు సర్వసముడవీవు
రమణీయముదలంప రత్నాకరుండవు
శాంతంబునెన్న సజ్జనుడవీవు
పరికింప సప్తసాగరములందొకడవై
యవనికావరణమై యమరినావు

గీ॥ ఇట్టిఘనుడవయ్యును వీడ వీశునాజ్ఞ
నెపుడు శిరసావహించుచు నొక్కింతయేని
మేరమీరక నడతువు మిగులభక్తి

ధరణినీగుణంబులు మార్గదర్శకములు
అఖిలసద్గుణ తేజ యో యద్రిరాజ॥ 1

మ॥ అతిగంభీరభయంకరాకృతులతో నత్యంతరౌద్రంబుతో
పతితంబయ్యెను నీశునాజ్ఞ లకటా పాటింపకున్నారిలన్
మితిమీరెన్ కలుషంబటంచు జగమున్ మిన్నంగ నేతెంచి శ్రీ
పతి శాంతంబువహింపుమన్న నటులన్ బద్ధుండవైనట్టు లీ
క్షితినీచర్యలు దెల్పుచుంటి నినువీక్షింపంగ నోసాంద్రమా॥ 2

శా॥ మానాథుండవు నీవుగావె కరుణన్ మమ్మేలవేయంచు నే
హీనంబౌ నదినైన నీదరికి దానేతెంచ సంప్రీతితో
నేనే యత్యధికుండనంచు మది నొక్కింతేనిగర్వింపక
త్యానందంబున జేర్చుకొందువుగదా తర్కింప వేలోపమున్॥ 3

ఉ॥ భూమిజ నాఖలుండు గొనిపోవగ మిక్కిలిఖేదమొంది శ్రీ
రాముడులంకకేగి యటరావణునిన్ బరిమార్పనెంచి స
త్ప్రేమదొరంగి తొల్లినిను భీకరదృష్టినిజూచినంతనో
స్వామికటాక్షముంచుమని చయ్యనమార్గము నీవెసాంద్రిమా॥ 4

సీ॥ సృష్టిచిత్రింబుల శోధింపనెంచిన
యసమానుడవుగావె యావనినీవు
నిఖలజీవులనెల్ల నిర్జింపపోషింప
సర్వశక్తుండవీ జగతినీవు
జలదమైదివికేగి జగతిపైవర్షించి
ధరణికాధారమై దనరినావు
పంటలపైరుల ఫలంబలంగ జేయుచు
సౌఖ్యంబుగూర్తువు జనులకీవు

ప్రీతిఫలంబునుగోర కతులితంబుగనెన్నొ
యుపకారము లొనర్చుచుందువీవు
భక్తవత్సలుడైనపరమేశుమహిమల
నిరతంబుదెల్పుచు నిల్చినావు
గీ॥ క్షారజలమయ్యె నిది క్షీరసాగరంబె
యైనమేలందుఁ గొందరీయవనినిన్ను
నీవులేకున్నలోకంబు నిలువగలదె
అతులగంభీరతేజమౌ యబ్ధిరాజ. 5
ధృవ॥ ఎరుగనేవిధమైనశాస్త్రములించుకేనియునైననీ
కరయుభక్తిని పంచరత్నములర్పణంబును జేసితిఁ
పరమపావనమూర్తివీవు నెపంబు లెన్నగబోకుమా
కరుణ సత్యవతీ నమస్కృతి గైకొనంగదె సాంద్రిమా॥

౧౩

మ॥ మరణావేదనఁబొందనీయక యకర్మంబుల్ దొలంగించినీ
చరణాబ్జంబులనిల్పి నామదిని నాచాంద్రార్కముగ నన్ను నీ
సరసన్నిల్వఁగఁజేయుమయ్యా వరముల్ చాలింక నేనొల్లనిన్
పరమానందముతోడఁ గొల్తుమది నాపద్బాంధవా మాధవా.



మ॥ నరజన్మంబు ధరించి భూమిపయి నానాబాధలం జెందిన నీ
దరిఁజేరందగు నేర్పులేక భువి నిత్యంబంచు భావించి దు
స్తరసంసార మహాంధకార జలధిన్ దండ్రి! నిన్గాంచకే
మరణంబందగ లేను నేటికయినన్, మన్నించి నన్నేలవే॥

మ॥ అపరాధంబుల సైచినావె జనకా! యత్యంత సంతోషమీ
వివుడే తెంచుట చిత్రమయ్యె నహహా! యెన్నాళ్ళ కెన్నాళ్ళకున్
కృపతోడన్ దయఁజేసినావు యికనాయిష్టార్థమీడేరుగా
యపవర్గాది సుఖంబులెల్ల నిడునా యానందముల్ గూర్పుమా॥

మ॥ అమితోత్సాహము సంగెనాదు మది కత్యానందము జేకూర్చె నా
తమముల్ బాపిన భానుమూర్తివలె మత్సంతాపముల్ దీర్చె నే

త్రిమునీనాథ కృతార్థమయ్యె తనువున్ ధన్యత్వమున్ బొందె హా
విమలంబౌ భవదీయరూపు కనులన్ వీక్షింపగా నెంతయున్॥

శా॥ కంటిన్ గంటి మహానుభావ త్రిజగత్కల్యాణమూర్తీ నినున్
వింటిన్ దేవ భవత్ప్రభావమును యీవిశ్వాంబులో, నెంతయున్
మింటన్ మేదిని నిన్నుబోలగలరే మేల్మేలు రక్షింపర
మ్మంటిన్ నీదగు మోము గాంచ జనకా! యానందమున్ బొందితిన్॥

---

# ప్రకటన.

బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులవారిచే రచియింపబడిన గ్రంథములలో ప్రస్తుతము దొరకు గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | తైత్తిరీయ బ్రాహ్మణము, స్వరసహితము | 5-0-0 |
| 2 | వైశ్యధర్మప్రకాశిక, ప్రతి వైశ్యునియింట తప్పక వుండవలసిన గ్రంథము, మూడవకూర్పు, క్యాలికో బైండుది | 3-0-0 |
| 3 | పురుషసూక్తము. స్వరము. ఆంధ్రటీకా తాత్పర్యము, షట్ భాష్యములతో | 0-8-0 |
| 4 | స్మార్తకర్మలు, సీమంతము, పుంసవనము, జాతకర్మ, నామకరణము, అన్నప్రాశన, చౌలము- స్వరము,ఆంధ్రటీకా క్రియాభాష్యములతో | 0-8-0 |

5 ఆశీర్వచనమంత్రములు, జట, పదము, క్రమము, ఘన, స్వరసహితము 0-8-0

6 ఋగ్వేద ఐతరేయ బ్రాహ్మణము 1-0-0

7 కాండానుక్రమణిక 0-6-0

8 శ్రీముఖావళి (ఉపన్యాస సహితముగ) 0-4-0

9 వైశ్యశాంకరీయ ఖండనము 0-4-0

10 ఉపనయనము స్వరక్రియా పద్ధతులు సూత్రముల సహితం 0-4-0

11 ఆబ్దికమంత్రము, ఆంధ్రటీకా తాత్పర్యముతో 0-4-0

11 మంత్రపుష్పము, గాయత్రి, ఆంధ్రటీకా తాత్పర్యసహితం 0-2-0

18 ఆర్యలఘు సంధ్యావందనము, ఆంధ్రటీకా తాత్పర్యము, భాష్యము, స్వరక్రియలతో 0-2-0

14 శ్రీసూక్తం. ఆంధ్రటీకా తాత్పర్యము,స్వరము,భాష్యములతో 0-2-0

15 పరాశరస్మృత్యుక్త వైశ్యధర్మ సంగ్రహము, ఆంధ్రటీకా తాత్పర్య సహితము 0-2-0

16 పుణ్యాహవాచనము. స్వరార్థక్రియా సహితము 0-2-0

17 విద్యున్నాపానము, స్వరార్థక్రియాసహితము 0-2-0

18 బ్రహ్మశ్రీ అయ్యగారి లక్ష్మీనరసింహ సోమయాజులవారికిన్ని శ్రీ శృంగేరీ స్వాములవారికిన్ని జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు 0-2-0

19 బ్రహ్మయజ్ఞము, స్వరార్థక్రియా సహితము 0-2-0

20 వేదవిషయమై యిచ్చిన ఇంగ్లీషు ఉపన్యాసము 0-2-0

21 పఞ్చేశ్వర విష్వక్సేన పూజలు. స్వరార్థసహితము 0-1-0

22 యజ్ఞోపవీతధారణ, విసర్జనమంత్రములుస్వరక్రియాసహితం 0-1-0

23 పరిషేచన మంత్రములు, స్వరార్థక్రియాసహితం 0-1-0

24 అమావాస్యతర్పణము స్వరక్రియాసహితము 0-1-0

25 పశువధఖండన (A protest against the torture of animals at religious sacrifices) ఇంగ్లీషున 0-1-0

26 వ్రాథసంస్కృతి పత్రికా ఖండన 0-1-0

27 రెండు ఆశీర్వచన మంత్రములు (స్వరార్థసహితము) 0-0-6

28 భగవద్గీత రెండు అధ్యాయములకు సూత్రార్థము. ఇట్టి వంటిఅర్థము ఇదివరకెవ్వరును కనిపెట్టియుండలేదు 0-4-0

(నమకము, చమకము, సూక్తార్థ ప్రకాశిక, దశశాంతులు, కృష్ణయజుర్వేద తైత్తిరీయ మంత్రార్థము మొదలగునవి త్వరలో ముద్రింపబడును.)

పేమరాజు బసవయ్య,

ప్రొప్రైటరు, [illegible] & కో. బుక్కుసెల్లర్సు. గుంటూరు.

